

# నామదేవుడు

మాధవ్ గోపాల్ దేశముఖ్



భారతీయ
సాహిత్య
నిర్మాతలు

భారతీయ సాహిత్య నిర్మాతలు



# నామ దేవుడు

మరాఠీ మూలం :

మాధవ్ గోపాల్ దేశముఖ్

హిందీ అనువాదం :

ప్రభాకర్ మాచ్వే

తెలుగు సేత :

భీమసేన్ 'నిర్మల్'



సాహిత్య అకాడెమీ

*Namadevudu* : Telugu translation by Bhimsen Nirmal of Madhavgopal Deshmukh in Marathi. Sahitya Akademi, New Delhi- (1985)





First Published : 1985

**సాహిత్య అకాదెమీ**

ప్రధాన కార్యాలయం :

రవీంద్ర భవన్, న్యూ ఢిల్లీ–110 001.

ప్రాంతీయ కార్యాలయాలు :

29, ఎల్డామ్స్ రోడ్, తేనాంపేట, మద్రాస్-600 018.

బ్లాక్ V-బి, రవీంద్ర సరోవర్ స్టేడియమ్, కలకత్తా-700 029.

172, ముంబయీ మరాఠీ గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్, బొంబాయి-400 014

రూ.

SAHITYA AKADEMI
REVISED PRICE Rs. 15.00

*Printed at* :

WELDUN PRESS, 2, Dr. Radhakrishna Nagar, Ist St., Madras-600 021

# అనుక్రమణిక

# మహారాష్ట్ర సాధుపుంగవులు-గురు నామదేవుడు

(క్రీ.శ. 1300)

## భారతీయ అధ్యాత్మిక జీవన వ్యాఖ్యాత

ఎన్నెన్నో జాతులు-ఉపజాతులతో కూడుకొని ఉన్నా, ఎన్నెన్నో భాషలు మాట్లాడినా, భారత ప్రజాసమూహం 'హిందూ' (ఇక్కడ ఈ మాటను వ్యాపక మయిన అర్థంలో వాడాను) జాతిగా రూపొందింది. కొన్ని విభిన్న లక్షణాలూ లేక మూలభూతమయిన భేదాలూ ఉన్నప్పటికీ, ప్రాచీన భారతదేశంలో రూపొంది, క్రీ.పూ. మొదటివేయి సంవత్సరాల కాలంలో సునిశ్చిత రూపం ధరించిన ఆలోచనా సరళి, జీవనపద్ధతి - ఈ రెంటిమూలంగా భారత జాతి ఈ విధమయిన ఏకాత్మ స్వరూపాన్ని పొందింది. ఈ ఏకాత్మకత ప్రధానంగా ప్రాచీన భారతీయ సాహిత్యం లోని బ్రాహ్మణ, బౌద్ధ, జైన సాహిత్యాలలోనూ - సంస్కృతంలోనూ, వేర్వేరు ప్రాకృత సాహిత్యాలలోనూ కనిపిస్తుంది. ఈ సాహిత్యంలో కేవలం వేదాలు, ఉపనిషత్తులవంటి బ్రాహ్మణ గ్రంథాలు, రామాయణ - మహాభారతాలు, పురాణాలు, కాళిదాసు రచనలు, ఇంకా ఎన్నో శాస్త్ర గ్రంథాలేకాక, పాళీ భాషలోను, బౌద్ధులు సంస్కృతభాషలో రచించిన హీనయాన - మహాయాన గ్రంథాలు, జైనులు సంస్కృత - ప్రాకృత భాషలలో రచించిన గ్రంథాలుకూడా చోటు చేసు కున్నాయి. భారతదేశంలో స్థిరపడిపోయిన వైదేశిక మతాలూ, సంస్కృతులు కూడా ఈ ఏకాత్మ భారతీయ సంస్కృతి, మనోప్రవృత్తి, జీవన విధానంవల్ల ప్రభావిత మయ్యాయి. ఇస్లాం, క్రైస్తవం, యహూదీ, పారసీక మతాలుకూడా భారతదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకున్న తరవాత, చూడగానే భారతీయ అంతర్ - ప్రవృత్తితో పూర్తిగా సమన్వయం కుదరని కొన్ని భారతేతర భావస్రవంతుల పట్ల ప్రసంగ వశాత్తు మొగ్గు చూపుతున్నట్లు కనిపించినా, భారతీయ మనో ప్రవృత్తికి భిన్నం గాను, విరుద్ధంగాను ఉండలేకపోయాయి.

భారతదేశంలో ఇస్లాంమతం ప్రవేశించిన తరవాత, గత వెయ్యేండ్లలో పరిస్థితులు మారినప్పటికి, మౌలికమయిన ఈ ఏకాత్మకతకు ఎట్టిభంగమూ వాటిల్ల లేదు. అయితే ఇస్లాంమతం తరవాత క్రైస్తవమతం భారతీయ ప్రకోష్ఠంలో తమకు వేర్వేరు అరలు ఏర్పరచుకున్నాయి. తమ దేశభ్రమణం మూలంగా ఈ ఏకాత్మ స్వరూపానికి కొత్తరూపం, కొత్త ఆశయం కల్పించిన దేశభ్రమణ ప్రియు లయిన విద్వాంసులు, వేదాంతులు, సాధువులు, భక్తులు నిజంగా ధన్యులు, వారి అనుగ్రహంవల్ల భారతీయ అంతర్ - ప్రవృత్తి, వైదేశికమయిన ప్రభావాల

మరుగున పడిపోలేదు. సంస్కృత - కావ్య పురాణాల కాలం తరవాత, దాదాపు క్రీ.శ. 800 ప్రాంతంలో జీవించిన మహానుభావుడు శంకరాచార్యులను తప్పకుండా ఉటంకించాలి. ఏకాత్మకతా నిర్మాణ నవీనకృషికి ఆయనను అగ్రదూతగా పేర్కొనవచ్చు. శంకరాచార్యులవారు కేవలం 32 సం॥లే జీవించారు. కాని వారు భారతదేశాన్ని మళ్ళీ ఒక త్రాటిమీద నడిపించడానికి తమ వేదాంత దర్శనం ద్వారా ఒక చమత్కారం చేసి చూపించారు. వారి వేదాంత దర్శనంలో ఒకవైపు నిర్గుణ పరబ్రహ్మ ప్రశంస ఉంటే, మరోవైపు పరబ్రహ్మ సగుణరూప ప్రశస్తి ఇమిడివుంది. ఆ తరవాత దేశభ్రమణ ప్రియులూ-పండితులూ అయిన ధర్మ గురువులు, భక్త సాధువులు వరసగా జన్మించారు. ముస్లిముల దండయాత్రలు, వారి పరిపాలన కారణంగా హిందూత్వం ముక్కలు - చెక్కలు అయిపోతున్న సమయంలో, మధ్య యుగంలోను, ఆధునిక కాలంలోను భారతదేశ విభిన్న ప్రాంతాలను వారు దగ్గరకు తీసుకొచ్చారు. వారిలో ప్రధానంగా పేర్కొన దగిన వారిలో పంజాబుకు చెందిన నానక్, అస్సాంకుచెందిన శంకరదేవుడు, బెంగాలుకు చెందిన చైతన్య మహాప్రభువు, కర్ణాటక దేశానికిచెందిన పురందరదాసు, మహారాష్ట్ర ప్రాంతానికిచెందిన నామదేవుడు మొదలయినవారు.

వీరేకాక అంత ప్రసిద్ధులు కానివారు, విస్తారంగా ప్రభావం లేనివారు ఇంకా చాలమంది వున్నారు. వారు హిందూ వేదాంతంలోని మౌలికమయిన సందేశాన్ని ప్రచారంచేసారు. వేదాంతానికి మూల కందాలయిన సిద్ధాంతాలను వర్తమాన యుగానికి అనుకూలంగా రూపొందించారు. అందులోని మూఢ విశ్వాసాలను ఎన్నింటినో తొలగించారు. వారు కర్మకాండలోని వికృతులను ప్రజాస్వామ్యానికి విరుద్ధమయిన ఎన్నో సాంఘిక భావాలను - ఆచారాలను విమర్శించారు. ఈ మహాత్ములందరూ ఆస్తికులే, భగవంతునిపట్ల విశ్వాసం కలవారే. వారు భగవంతునిపట్ల భక్తి నిష్ఠలను ప్రచారంచేశారు. దీనులు, దరిద్రులు, దుఃఖపీడితులు అయినవారికి నిస్వార్థభావంతో అంకితమయి పోవాలని ఉద్బోధించారు. ఆ రోజుల్లో హిందూ సమాజంలో జాతిభేద ప్రాచుర్యం మూలంగా, మానవులంతా సమానులనే భావానికి ఆస్కారం లేక పోవడంతో, వారు మానవులంతా సమానులే అన్న సిద్ధాంతాన్ని సాధికారంగా నిరూపించి, అమలు పరచడానికి పూర్తిగా ప్రయత్నించారు. విదేశ మతాలలో గల శ్రేష్ఠమయిన, ఉత్తమమయిన భావాలను ఎన్నింటినో హృదయ పూర్వకంగా స్వీకరించారు. సామాన్య ప్రజలకుగల వ్యక్తిగత, సాంఘిక ఆధ్యాత్మిక అవసరాల దృష్ట్యావారు సామాన్య ప్రజలకు అతి సన్నిహితులు కాగలగడం వారి విశిష్ట లక్షణం.

భారతదేశంలోని ఇతర ప్రాంతాలలోవలెనే, మహారాష్ట్ర దేశంలోకూడా, గత వెయ్యేండ్లుగా ఇలాంటి మహాత్ములయిన ధర్మగురువులు ఉద్భవిస్తూనే వచ్చారు. ఇతర ప్రాంతాలలోవలెనే మహారాష్ట్రంలో కూడా బ్రాహ్మణ ప్రాముఖ్యాన్ని బలపరచే వేదాంత దర్శనానికి బాగా పలుకుబడి వుండేది. కాని దానితోపాటే ఇతర సిద్ధాంతాలు కూడా జన సామాన్యంలో ప్రచారంలోవుండేవి. ఉదాహరణకు కర్ణాటకంలో లింగాయత్ లేక వీరశైవ సంప్రదాయం, వంగదేశంలో సహజియా పంథ్, కర్తాభజ్‌పంథ్ మొదలయినవి 3వ శతాబ్దంలో ముకుందరాయ్ అనే వేదాంతి బ్రాహ్మణ వాద సంప్రదాయాన్ని బాగా ప్రచారం చేశాడు. ఆ తరవాత జ్ఞానేశ్వరుడు వచ్చాడు. ముకుందరాయని సమకాలీనులలో వృద్ధుడయిన చక్రధరు డొకడు. ఆయన కృష్ణభక్తి, గురుదత్తాత్రేయ భక్తి కేంద్రంగాగల సంప్రదాయాన్ని స్థాపించాడు. ఈ సంప్రదాయ ముఖ్య లక్షణాలలో విగ్రహపూజను తిరస్కరించడం ఒకటి. మహారాష్ట్రదేశంలో మహానుభావ సంప్రదాయం అంతగా ఆదరణను పొందలేక పోయింది. అదీగాక ఈ సంప్రదాయానికి సంబంధించిన ఉపదేశాలు గుప్తభాషలోనూ, సంకేత లిపిలోనూ వుండేవి. దాంతో అవి సామాన్యులకు అందుబాటులో లేకుండాపోయాయి.

మహారాష్ట్రదేశంలో సంప్రదాయబద్ధంగా వస్తున్న బ్రాహ్మణవాద హిందూత్వాన్ని ఎంతోమంది ధర్మగురువులు ప్రచారంచేశారు. వీరిలో నామదేవుడు (13వ శతాబ్దం), ఏకనాథస్వామి (1448 - 1599), తుకారాం (1588–1649), సమర్థ రామదాసు (1608–1682) పేర్కొనదగినవారు. ఈ ధర్మగురువులకు హిందూ మత గ్రంథాలతో క్షుణ్ణంగా పరిచయంవుండేది. వారు విశిష్టమయిన తమ ఉపదేశ విధానం ద్వారాను, ప్రజల వాడుకభాషలో ఉపదేశాలు ఇవ్వడంద్వారానూ, ప్రజా హృదయాలలోకి చొచ్చుకొనిపోయారు. జ్ఞానేశ్వరుడు భగవద్గీతకు వ్యాఖ్యానమయిన 'జ్ఞానేశ్వరి'ని సంస్కృత నిష్ఠమయిన మరాఠీభాషలో వ్రాసాడు. దాంతో అది విద్వాంసులకే పరిమితమయిపోయింది. కాని జ్ఞానేశ్వరుడి తరవాత వచ్చిన నామదేవాదులు జన సామాన్యానికి అర్థమయ్యే భాషలో కీర్తనలు రచించి, తమ దివ్యానుభూతులను జన సామాన్యానికి అందించారు. ఇలా మహారాష్ట్రంలోనే కాక, మధ్యయుగంలో, దేశంలోని అన్ని ప్రాంతాలలోను, జన సామాన్యానికి అర్థమయ్యేభాషలో తమ దివ్యానుభూతులను అందించిన మహాత్ములు ఉద్భవించారు. అటువంటివారిలో వంగదేశంలోని వైష్ణవ మహాజనులు, అస్సాంకు చెందిన ఏక శరణియా గురువులు, ఉత్తర ప్రదేశానికి చెందిన కబీర్‌దాసు, తులసీదాసులు, వారి శిష్య-ప్రశిష్యులు, గుజరాతుకు చెందిన నరసీమెహతా, రాజస్థానంలో

దాదూదయాల్, పంజాబులోని సిక్కుగురువులు పేర్కొనదగినవారు దక్షిణభారత దేశంలోకూడా తమ రచనలద్వారా ప్రజాహృదయాలను ఆకట్టుకొన్న వైష్ణవ ఆళ్వారులూ, శైవ నాయనార్లూ ఉన్నారు. బసవేశ్వరుడు, పురందరదాసు, త్యాగరాజు ఈ కోవకు చెందినవారే.

మహారాష్ట్ర ప్రాంతపు సాధువుల్లో నామదేవుడికి ఒక వైశిష్ట్యమున్నది. ఆయన ఉపదేశ కార్యక్రమం కేవలం మహారాష్ట్ర ప్రాంతానికే పరిమితం కాలేదు. ఆయన గురునానక్, చైతన్య మహాప్రభువు, శంకరదేవునివలె అఖిలభారత వ్యక్తిత్వాన్ని సంతరించుకున్నాడు. మహారాష్ట్రంలో ఉద్భవించిన నామదేవుడి జీవితం ఉత్తర భారతంలో - అదీ చాలావరకు పంజాబులో గడిచింది. అక్కడి ప్రజలు ఆయనను పరమేశ్వర కృపాకటాక్ష లబ్ధుడయిన గురువువలె స్వీకరించారు. ఆయన మహారాష్ట్ర - పంజాబురాష్ట్రాలు రెండింటికి అవిభాజ్యమయిన వ్యక్తిగా రూపొందాడు. అయినా ఆయన జీవితక్రమం, దేశాంతర గమనం గురించిన వివరాలు స్పష్టంగా మనకు తెలియవు. ఆయన పుట్టినతేది వివాదాస్పదం. ఆయన జ్ఞానేశ్వరుడికి సమకాలీనుడన్న లోకప్రవాదం అంత త్రోసిరాజనదగింది కాదు. కాని జ్ఞానేశ్వరుడి మరాఠీ భాషాశైలికి, నామదేవుడి మరాఠీ భాషాశైలికి చాలా భేదమున్నది. అందుచేత రామకృష్ణ గోపాల్ భండార్కర్ మొదలయిన విద్వాంసులు నామదేవుడు జ్ఞానేశ్వరుడి తరవాత వందయేండ్లకు పుట్టి ఉంటాడని భావిస్తున్నారు. నామదేవుడి జీవితాన్ని గురించి ప్రచారంలోవున్న రచనలవల్ల మనకంతగా ఉపయోగంలేదు. అవి సాధుపుంగవుల జీవన సువర్ణగాథలవలె ఉన్నాయి కాని కవిగా, ఉపదేశకుడిగా నామదేవుడి జీవితాన్ని గురించి గంభీరంగా అధ్యయనంచేసి వ్రాసినవికావు. నామదేవుడు క్రి.శ. 1270 లో పుట్టాడనీ, 1350 లో దివంగతుడయి ఉంటాడనీ విద్వాంసుల అభిప్రాయం. ప్రజల్లో ప్రచారంలో ఉన్నది కూడా అదే. నామదేవుడు 14 వ శతాబ్దపు మొదటి దశకాల్లో రచనా కార్యక్రమం సాగించి వుండవచ్చు. నామదేవుడు రచించిన కవితల, గీతాల భాష ప్రాచీన హిందీ, గురుగ్రంథ సాహెబులో పంజాబీ మిశ్రితమయిన భాష అది. కొన్ని రచనలు శుద్ధమయిన హిందీలోనూ, మరాఠీలోనూ వున్నాయి. హిందీ, పంజాబీ, మరాఠీ ఈ మూడు ప్రాంతాల్లో నామదేవుడి జీవిత సత్యాలనుగురించి చెప్పే విషయాల్లో పొంతనలేదు. కొంతమంది ఆయన గురునానక్ సమకాలీనుడని అంటారు. నానక 15 వ శతాబ్దపు చివరిభాగానికి చెందినవాడు. నామదేవుడు మరాఠీ భాషలోవ్రాసిన కీర్తనల సంఖ్య 250 అని అంటారు. హిందీలో దాదాపు 214 కీర్తనలు ముద్రించబడ్డాయి. గురు గ్రంథ సాహెబులో 61 కీర్తనలు

ఉన్నాయి. నామదేవుడు మరాఠీలో, హిందీలో, పంజాబీలో, మిశ్రితమయిన హిందీలో రచించిన కీర్తనల శుద్ధప్రతిని ప్రచురించవలసిన అవసరం ఎంతగానో ఉంది. అది ఎంత త్వరగా ముద్రించబడితే అంత మంచిది. అయినా ఇంత మటుకు నామదేవుని కీర్తనలను సేకరించి ప్రచురించిన విద్వాంసులకు కృతజ్ఞతలు చెప్పాలి. ముఖ్యంగా 'నామదేవ్ - జీవన్ ఔర్ కవితా' అనే పుస్తక రచయిత డా॥ ప్రభాకర్ మాచ్వే అభినందనీయుడు. ఈ పుస్తకం ఇంగ్లీషులోనూ పంజాబీ లోనూ లభిస్తుంది. గురునానక్ పంచ శతజయంతిని పురస్కరించుకొని, పాటియాలలోని పంజాబు యూనివర్సిటీ వారు ఈ పుస్తకాన్ని ప్రచురించారు. ఈ పుస్తకంలో నామదేవుని జీవితం - ఉపదేశాలను గురించిన సత్యాలు, కపోల కల్పనలు ఎంతో ఉపయోగకరంగా వివరించబడ్డాయి. నామదేవుని భక్తి కావ్య స్వరూపం, గ్రంథ సూచికలు, మరాఠీ - హిందీనుండి ఏర్చి కూర్చబడ్డ కీర్తనలకు ఆంగ్లానువాదం, గురు గ్రంథ సాహెబులోని 61 కీర్తనలకు మెకాలిఫ్ చేసిన ఆంగ్లానువాదం ఈ పుస్తకంలో వున్నాయి.

నామదేవుణ్ణి గురించి నిఖార్సయిన శాస్త్రీయ విమర్శ ఇప్పుడిప్పుడే ప్రారంభమయింది. అది డా॥ మాచ్వే గ్రంథాన్ని ఆదర్శంగా పెట్టుకొని, వివరణాత్మక అధ్యయనంవలె జరగాలి. అన్నిటికంటే ముందుగా నామదేవుడిపేరిట ప్రచారంలో ఉన్న కీర్తనలనుండి శుద్ధ పాఠంకల సంకలనం ఒకటి ప్రచురించబడాలి.

తమ గీతాలలో ఉపదేశం, నీతిని ప్రబోధించిన ధర్మోపదేశకులవలె సాధు పుంగవులవలె నామదేవుడు కూడా ధర్మప్రచారం చేసాడు. అందుచేత ఆయన ధార్మిక విశ్వాసాల క్రమ వికాసాన్ని ముందుంచే ప్రయత్నంచేస్తారు కొంతమంది. దానికి ఆధారం నామదేవుని కీర్తనల వర్ణ్యవిషయం. శిల్పం, మానవరూపంలో అవతరించిన సగుణుడయిన పరమాత్మణ్ణి - ఉదాహరణకు బృందావనంలోని శ్రీకృష్ణుడు, షోలాపూరు జిల్లాలోని ప్రసిద్ధ తీర్థస్థానం పండరిపురంలో విఠలుని రూపంలో వెలసిన విష్ణువు - పట్ల ఆయన తన ఉత్తమ భక్తిని అభివ్యక్తీకరించాడని మహారాష్ట్రంలో విశ్వసిస్తారు. ఈ అభిప్రాయం ఇంకా నిరూపించబడలేదు నామదేవుడి జీవితంలో కాలక్రమానుసారంగా ధార్మిక భావసరళి గంభీరమవుతూ వచ్చింది. ప్రేమ - సౌందర్యాలకు ఆటపట్టయి, మానవరూపం ధరించిన భగవంతుని పట్ల నమ్మకం కలిగి ఉండడం అనే ఈ పౌరాణిక భక్తివలన ఆయనకు సంతృప్తి కలగలేదు. అంచేత పరమాత్ముడి నిర్గుణ రూపంపట్ల ఆయనకు ఆసక్తి కలిగింది. తరవాత పరిపక్వదశలో వ్రాసిన గీతాలకూ కబీర్, రజ్జబ్, దాదూ, నానక్ ఇతర సిక్కుగురువులు - ఇలాంటి నిర్గుణ సాధువుల రచనలకూ సామ్యం

కనిపిస్తుంది. నిర్గుణ పరమాత్మపట్ల భక్తి నిష్ఠలు కలిగివున్నా, కావ్య సౌందర్య పక్షానికి లోపం కలగలేదు. చరమదశలో ఆయన రచించిన కీర్తనలు, ఎక్కువగా ఉత్తర భారతదేశంలో రచించబడ్డాయి. ధార్మికానుభూతికిగల ఈ రూపం సిక్కు ధర్మానుయాయులను, ముఖ్యంగా గురునానకును ఆకట్టుకొని వుండవచ్చునని తలుస్తున్నారు.

ఆయన జీవితం, ధార్మికోపదేశాలలోని సత్యాల మాట ఎలా ఉన్నా, మధ్య యుగంలోని ధర్మ గురువులలో నామదేవుడికి విశిష్టమయిన స్థానం ఉన్నదనడంలో ఎటువంటి సందేహమూ లేదు. 15 వ శతాబ్దపు చివరి భాగంలో గురునానకు జన్మించేటప్పటికే, నామదేవుడు ఉత్తర భారతంలోని ధార్మికరంగాన్ని ప్రభావితం చేసాడు.

తమ సందేశం, ఉపదేశం, రచనలు, శిష్యప్రశిష్యులరూపంలో సాధువులూ, మహాత్ములూ నిత్యం జీవించేవుంటారు. భారతీయ సంప్రదాయంలో జనన మరణాలకు సరియైన తారీకులకూ, తిథులకూ, చారిత్రికాంశాలకూ అంతగా విలువలేదు. సమస్త జీవితకాలనికి క్షణమాత్రంకంటే ఎక్కువ విలువ కట్టబడలేదు. కనుక భౌతిక జీవితానికి సంబంధించిన వివరాలకు విలువవుండదు. నామదేవుడి పట్ల అదే జరిగింది. అయితే మనం ఆయన గీతాలకు ముఖ్యంగా గురుగ్రంథ సాహెబు లోని 61 కీర్తనలకు, మరాఠీ గీతాలకు, అభంగ్‌లకు ఎంతగానో ఋణపడివున్నాం. వాటి మూలంగానే ఆయన ఇంకా జీవించి వున్నాడు. మరాఠీ, హిందీ గీతాల పూర్తి శుద్ధ ప్రతులు లభించినపుడు ఆ మహా సాధుపుంగవుని సందేశాన్ని ఇంకా చక్కగా అర్థం చేసుకోవచ్చు.

అయినప్పటికీ ఆ మహాభక్తుడికి, ఉపదేశకుడికి స్మృత్యంజలి ఘటిస్తున్నాము. ప్రతిభా సంపన్నుడయిన ఆ గాయకుడు దివ్య ద్రష్ట అనంత తత్త్వానుభూతి పొందినవాడు. భాతతదేశపు ధార్మిక సాంస్కృతిక జీవనం వైదేశికమయిన భావ సరళితో సంఘర్షశీలమయి వుండి, దేశంలో ఆంతరిక - ఆధ్యాత్మిక విద్యాభక్తులు నశించి పోతున్నకాలంలో, భారతదేశపు ఏకాత్మకతను సాధించడానికి ప్రయత్నించిన మహాపురుషుడు నామదేవుడు.

4-12-1970
కలకత్తా.

—డా॥ సునీతికుమార్ చటర్జీ,
అధ్యక్షుడు,
సాహిత్య అకాడమి, న్యూ ఢిల్లీ.

# అనువాదకుడి తొలిపలుకు



అనేకత్వంలో ఏకత్వాన్ని దర్శించగలగడం భారతీయ సంస్కృతికి గల విశిష్టలక్షణం. ప్రాచీన కాలంనుండి ద్రష్టలయిన మహాకవులు, సాధుపుంగవులు తమ రచనల ద్వారా ఈ వైశిష్ట్యాన్ని ఎలుగెత్తి చాటుతూవచ్చారు. అనేక భాషలతో, సాహిత్యాలతో విలసిల్లే భారతావనిని ఒకే త్రాటిమీద నడిపించగలిగిన కలుగుతున్న మహత్తర శక్తి ఇదే. ఈనాడు మనం ఇతర భాషల సాహిత్య రచనలను చదివీ, సాహిత్య స్రష్టలను గురించి తెలుసుకొనీ, అన్నింటిలోనూ అంతస్సూత్రంగా వ్యాపించివున్న ఈ సత్యాన్ని గుర్తించ గలుగుతున్నాం. దీనికి అనువుగా రచనలు ప్రచురించి, భావాత్మక ఐకమత్య సాధనకు తోడ్పడుతున్నది కేంద్ర సాహిత్య అకాడమీ.

మహారాష్ట్ర ప్రాంతంలో అగ్రగణ్యుడయిన నామదేవుడి జీవితాన్ని, రచనలను తెలుగువారికి పరిచయంచేసే ఈ అవకాశం నాకు కల్పించిన అకాడమీ కార్యకర్తలకు, ముఖ్యంగా డా॥ చల్లా రాధాకృష్ణమూర్తి గారికి నా కృతజ్ఞతలు.

నా అనువాద కృషిలో సహకరించిన మిత్రులు డా॥ పి. జీ. లాలే గారికి, డా॥ వి. డి. కులకర్ణిగారికి నా నమోవాకాలు.

గాంధీ నగర్,
హైదరాబాదు-500 380

—భీమసేన్ 'నిర్మల్'

# జీవితకథ - చమత్కారాలు

'మహాభక్తుడు నారదుడు, అతడి మహావ్రతమే నామదేవుడిది,
విఠలుడనేదే ఆ పరమాత్ముడి భవ్యనామమన్నాడు.'

—మోరోపంత్

13 వ శతాబ్దంలో మహారాష్ట్రంలో ఉద్భవించిన సాధుపుంగవులలో కాల క్రమంగానే కాక, ఇతర విశిష్టగుణాలు కారణంగా కూడా నామదేవుడు అగ్రగణ్యుడు. మరాఠీ భాషలో 'అభంగ్' అనే ఛందస్సులో రచన చేయడాన్ని వాడుకలోనికి తెచ్చినవాడు నామదేవుడు. కేవలం మరాఠీ భాషలోనే కాదు, భారత దేశంలోని ఇతర భాషల్లో కూడా 'అభంగ్' రచనను వాడుకలో తెచ్చినవాడు నామదేవుడు. సిక్కు సంప్రదాయ సంస్థాపకుడయిన గురునానక్‌కు నామ మాహాత్మ్య ప్రేరణ నామదేవుడి వల్లనే కలిగింది. అంతేకాదు, సిక్కుల ఆది గ్రంథం (గురుగ్రంథ సాహెబు)లో మరాఠీతో పోలికలు కల 'సధుక్కడీ' (సాధువుల భాష)లో రచించబడ్డ నామదేవుడి రచనలు చోటుచేసుకున్నాయి. నామదేవుడి కార్యక్షేత్రం కేవలం మహారాష్ట్ర ప్రాంతందాకానే పరిమితం కాలేదు. నర్మదా నదికి ఉత్తరాన, నేటి పంజాబు ప్రాంతందాకా నామదేవుడు భక్తిమార్గ ప్రచారం చేసాడు. ఉత్తర భారతదేశంలో భక్తిమార్గ ప్రచార ప్రసారాలుచేసిన మహారాష్ట్ర సాధువులలో నామదేవుడు అగ్రగణ్యుడు. మహారాష్ట్ర దేశానికి చెందిన సాధువులలో నామదేవుడు ఎక్కువకాలం జీవించాడు. ఆయన బాల్యంనుండి జీవితాంతం వరకు నిరంతరం విఠలభక్తిని ప్రబోధిస్తూనే ఉన్నాడు. నారదమునివలెనే భగవద్భక్తి అనే వ్రతం చేపట్టి, నామదేవుడు పరమాత్ముడికి గల 'విఠలు'డనే భవ్యనామాన్ని సువిఖ్యాతం చేసాడని మోరోపంత్ చెప్పినమాట శతథా యథార్థం.

## నామ సార్థక్యం

నామదేవుడనేది ఒక సమాసం. దానికి అర్థం నామమే దేవుడని. నామదేవుడు తన సమస్తరచనల్లో నామ మాహాత్మ్యాన్ని ఎన్ని విధాలుగానో వర్ణించాడు. అలా మరే భక్తుడు వర్ణించ లేదంటే అతిశయోక్తి కాదు.

'నామంలోనే నారాయణుడు
అది భక్తుల కధీనం
భక్తి అవసరం లేదు
నామంలోనే చతుర్విధ ముక్తి.
నామస్మరణ మరవవద్దు
అదే స్వర్గ మార్గం
నామస్మరణ చేసేవారు
నారాయణ సములవుతారని నామదేవుడంటున్నాడు.'

'నామస్మరణ చేసేవానికి
యముడు కూడా వందనం చేస్తాడు.
ఆ నామం శ్రేష్ఠం, అన్నిటిలో వరిష్ఠం
నామోచ్చారణతో స్వర్గం ప్రతిధ్వనిస్తూ వుంటుంది.
నామ మహిమ వర్ణించ బోయాడు బ్రహ్మ
అది అంతం తోచనేలే దతనికి
నామోచ్చారణ చేస్తే
ఆ నామం ద్వారానే స్వర్గమార్గం సులభం.
విఠల హరి ప్రత్యక్షమవుతాడు నామం వల్లనే.'

'వద్దు ముక్తి, వద్దు నీ భక్తి
నా శాంతియే వేరు
నాకు నాదేదో తెలిసింది, తెలిసిపోయింది.
ప్రేమ సుఖం తెలిసివచ్చింది.
నిన్ను ధ్యానించను, బ్రహ్మజ్ఞాన సాధన వద్దునాకు
నా పంథాయే వేరు.
నిన్ను స్తుతించను, నీగుణ కీర్తన చేయను నేను
నా ముక్తి పద్ధతియే వేరు.
కాయాన్ని కష్టపెట్టను, ఇంద్రియ నిగ్రహం వద్దు
నా జ్ఞానమే వేరు.
నిర్వికల్ప నామాన్ని స్మరిస్తాను
నన్ను వెతుక్కుంటూ నీవే వస్తావు.'

నామం ముముక్షువు అయిన వ్యక్తికి, భక్తుడికి సర్వస్వం అనీ, మోక్ష ప్రాప్తికి, భగవత్ప్రాప్తికి నామమే ఏకైక సాధనమనీ నామదేవుడు పదేపదే నొక్కి వక్కాణించాడు. నామ మహాత్మ్యాన్ని వర్ణించే అభంగాలను పరిశీలిస్తే, నామజప సార్థక్యాన్ని నిరూపించేందుకే, మాటి మాటికి 'నామాకహే' (నామదేవుడు అంటున్నాడు) అని అన్నా డనిపిస్తుంది

## జీవిత చరిత్ర

నామదేవుడి జీవిత సంఘటనలను గురించి ఎన్నో వివాదాలున్నాయి. నామదేవుడి స్వగ్రామ మేది? ఆయన ఎప్పుడు, ఎక్కడ, ఎలా జన్మించాడు? ఆయన కుటుంబ సభ్యులు ఎవరు? ఆయన మొదట్లో బందిపోటు దొంగ అవునా కాదా? నామదేవుడు ఒక్కడా ఇద్దరా? నామదేవుడికి, జ్ఞానదేవుడికి జత ఎలా కుదిరింది? నామదేవుని గురువు ఎవరు? ఆయన జీవితంలో పరస్పర వ్యతిరేకాం శాలను పరిష్కరించే దెలా? నామదేవుని పేరిట ప్రచారంలోవున్న విచిత్రో దంతాలు నమ్మతగ్గవేనా? ఆయన 'వారకరీ' సంప్రదాయ సంస్థాపకుడా కాదా? ఆయన నిజంగా పంజాబు వెళ్ళాడా? గురుగ్రంథ సాహెబులో ఉన్నవి ఆయన రచనలేనా? ఇలా వివాదాస్పదమయిన అంశాలు ఎన్నో వున్నాయి. వీటన్నింటిని గురించి విపులంగా వివరించే గ్రంథాలు అనేకం వ్రాయబడ్డాయి వీటన్నింటినీ క్రోడీకరించి వివాద రహితంగానూ, అందరికి అర్థమయ్యే పద్ధతిలోనూ, నామ దేవుడి చరిత్రను మీ ముందుంచుతాను.

## పుట్టుక, స్థలము, కాలము

నామదేవుడు పండరిపురంలో క్రి. శ. 26-10-1270 నాడు జన్మించాడు. ఆయన తండ్రి దామాషేట్ షింపీ, తల్లిపేరు గోణాయి వీరు అసలు పర్భణీ జిల్లాలోని నర్సీబామణి అనే గ్రామానికి చెందినవారు. కాని వారు నామదేవుడు పుట్టకముందే పండరిపురం వచ్చి అక్కడ స్థిరపడిపోయారు. పండరిపురం వచ్చిన తరవాత గోణాయి పాండురంగడికి మొక్కుకుంది. అలా మొక్కుకున్న తరవాత ఆమెకు పుట్టిన కొడుకే నామదేవుడు. ఈ విషయం గురించిన ఆధారాలలో నామదేవుడి దాసి జనాబాయి రచించిన క్రింది అభంగ్ సుప్రసిద్ధమయింది.

'అమ్మ ధ్యాస కలిగిందప్పుడు
విఠాబాయి అనే అమ్మ [1]

---

1. మహారాష్ట్రంలో భగవంతుణ్ణి తల్లిగా ఎంచుకునే సంప్రదాయమున్నది.

ఆదిస్థానం పండరిపురం
అందగాడు కిష్టయ్య ఉంటాడక్కడ
గోణాయి మొక్కుకుంది నాకొక కుమారుణ్ణి ప్రసాదించమని.
నిర్మలమయిన ఆమె ప్రార్థన విని
నామదేవుడు ప్రవేశించాడు ఆమె గర్భంలో
దామాషేట్ ఆనందంతో ఉప్పొంగిపోయాడు.
దాసీ జనాకు కలిగింది ఉత్సాహం.'

సాధుపుంగవుల జీవితచరిత్రలు వ్రాసిన మహీపతి తన 'భక్తవిజయం' అనే గ్రంథంలో ఇలా వ్రాశాడు. 'నామదేవుడు' 'అయోనిజుడు.' అనగా ప్రకృతి నియమానుసారం మాతృగర్భంనుండి పుట్టలేదు. దామాజీ, గోణాయికి భాగీరథీ నదిలో ముత్యపు చిప్పలో 'నామదేవుడు లభించాడు.' నామదేవుడు శింపీ (దర్జీ) జాతికి చెందినవాడవడంతో, 'శింపీ'కి 'సీపీ'కి ఉన్న వర్ణసామ్యంతో ఈ కథను ఎవరో భక్తుడు కల్పించి వుంటాడు. ప్రపంచంలో మహాత్ముల పుట్టుకను గురించిన అద్భుత కథావలయాలవలెనే నామదేవుడి జననంగురించి ఈ కథ కల్పించబడిందని చెప్పడం సమంజసం. పైన ఉదహరించిన జనాబాయి అభంగ్‌లోనూ, స్వయంగా నామదేవుడు తన్నుగురించి చెప్పుకొన్న కృతులలోనూ, నామదేవుణ్ణి గురించి ఇతర సాధువులు చెప్పినదాంట్లోనూ, అన్నిచోట్లా నామదేవుడు అందరి వలెనే మాతృ గర్భంనుండి పుట్టాడనే చెప్పబడింది. అదే విశ్వసనీయ మనిపిస్తున్నది.

కుటుంబం

భగవద్భక్తుల వంశంలో పుట్టడంతో బాల్యంనుండే నామదేవుడి మనస్సులో భక్తి బీజాలు అంకురించాయి ఆయనకు విఠలుడిపట్ల ధ్యాస ఏర్పడింది. 11వ ఏటనే గోవిందశెట్టి సదావర్తే కూతురితో ఆయన వివాహం జరిగింది. ఆమె పేరు రాజాయి. వివాహం తరవాత కూడా నామదేవుడి మనస్సు కుటుంబ వ్యవహారాల పట్ల కానీ, కులవృత్తి అయిన దర్జీపనిపట్ల కానీ లగ్నంకాలేదు. చేతిలో చిడతలు ధరించి, పండరిపుర దేవాలయంలో రాత్రింబగళ్ళనక విఠలనామ సంకీర్తన చేయడమనే పిచ్చి బాగా తలకెక్కింది. తల్లీ, భార్యాకూడా ఈ పిచ్చి ధోరణి మాన్పించడానికి ఎంతగానో ప్రయత్నించారు. అయితే అవి అగ్నిలో పోసిన ఆజ్యంలా అయినవి. భక్తి తరగడం మాని పెరగసాగింది. నామదేవుడు తన పూర్వాశ్రమ కథను గురించి ఒక అభంగ్‌లో ఇలా వ్రాసాడు.

'శింపీకులంలో పుట్టానునేను, కాని నా మనస్సు సదా శివుడి[1] పట్ల లగ్నం.
రాత్రింబవళ్ళు కుడుతూనే (జపిస్తూనే) ఉంటాను
నా జీవుడికి వేరే పనిలేదు
సూదీ-దారం, కత్తెర-గజంబద్ద అన్ని శివుడే
శివుడిలోనే విఠోబా ఉన్నాడని నామా అంటున్నాడు
అతని మూలానే ధన్యుణ్ణయ్యాను నేను.'

నామదేవుడికి నలుగురు కొడుకులు పుట్టారు. నలుగురు కోడళ్లూ ఇంట్లో అడుగు పెట్టారు. ఇలా ఆ కుటుంబంలో తల్లీ, తండ్రి, భార్యా-భర్తలు, నలుగురు కొడుకులు, నలుగురు కోడళ్ళు, లింబాయి అనే కూతురు, అఉతాయి అనే సోదరి, జనాబాయి అనే దాసి మొత్తం 15 మంది వుండేవారు. ఈ కుటుంబాన్ని జనాబాయి ఇలా వర్ణిస్తుంది.

'గోణాయి, రాజాయి అత్తాకోడళ్ళు
దామానామాలు తండ్రీ కొడుకులు
నారా, విఠా, గోందా, మహాదా అని నలుగురు సంతానం
కలిగారు అతని పవిత్ర వంశంలో
లాడాయి, గోడాయి, మేసా, సాబరాయి
నలుగురు కోడళ్ళు నామదేవుడికి
లింబాయి కూతురు. అఉతాయి సోదరి
పిచ్చిది జనా అనేది దాసి.'

నామదేవుడు తల్లీ-తండ్రి, కుటుంబంలోని ఇతరుల దూషణ-భూషణలు భరిస్తూనే, భక్తి మార్గంలో ముందుకు సాగాడు. కుటుంబంపట్ల ఆసక్తి తగ్గుతూ వచ్చింది. పండరిపురంలోని చంద్రభాగా నదీ తీరంలో ఆయన భక్త పరివారం విస్తరిల్లుతూ వచ్చింది.

## జీవిత పూర్వార్థం

నామదేవుడి జననం గురించిన కట్టు కథలవలెనే, ఆయన జీవిత సంఘటనలను గురించి ఎన్నో కథలు ప్రోది చేసుకున్నాయి. ఒక కథ ప్రకారం ఆయన మొదట బందిపోటు దొంగ. తరవాత పశ్చాత్తప్తుడయి, భక్తి మార్గంలో ప్రవే

1. మరాఠీ మూలంలో 'సదాశివీ' అనే మాటలో శ్లేషవుంది. ఆమాటకు సదాశివుడనీ, 'సదా' (ఎల్లప్పుడూ) 'శివీ' కుట్టుకునే వాడనీ రెండు అర్థాలు.

శించాడు. ఈ సంఘటనను ఉటంకిస్తూ నామదేవుడు ఒక అభంగ్ వ్రాశా డంటారు. నామదేవుడి మరణానంతరం ఆయనకు గౌరవం ఆపాదించడానికి దాన్ని ఎవరో వ్రాసివుంటారు. ఎందుకంటే నామదేవుడి జీవిత కథలో ఇతరత్రా ఎక్కడా నామదేవుడు బందిపోటు అని చూచాయగా కూడా చెప్పబడలేదు.

మహానుభావుల 'లీలా చరిత్ర' అనే గ్రంథంలో 'విఠల వీరూకథన్' అనే అధ్యాయంలో 'నేమ్‌దేవ్' అనే ఒక కోరీ (జాలరి) దార్లు కొట్టేవాడని చెప్పబడింది. అతను నామ్‌దేవ్ విఠల్ అనే బ్రాహ్మణునికి, మ్హాయాగురల్ (పూజారి)కి మిత్రుడు. ఈ ముగ్గురూ బందిపోటు దొంగలట. బహుశ ఈ కథ ఆధారంగా నేమ్ దేవుణ్ణే నామదేవ్ అని అనుకొని వుంటారు. 'కోరీ' 'శింపీ'గా మారిపోయి వుంటుంది. నామదేవుడి మిత్రులు దొంగలుగా మారిపోయారు. కాని నేమ్‌దేవ్‌కోరీ, నామదేవ్ శింపీ ఒక్కరే అని ఎవరూ నిరూపించలేదు.

మహానుభావ సంప్రదాయానికి చెందిన 'స్మృతి స్థల్' అనే గ్రంథంలో విష్ణుదాస్ నామయా లేక నామదేవ్ శింపీ అనే వ్యక్తికి దామోదర పండిత్ ఉప దేశం చేసాడని ఉటంకించబడింది. ఈ గ్రంథంలో ఉటంకించబడిన ఈ వ్యక్తి, మన నామదేవుడు వేర్వేరు వ్యక్తులు.

## ఒకరా? అనేకులా?

నామదేవుడు రచించిన అభంగ్‌లలో, నామదేవుడు రచించినవే కాకుండా 'నామా', 'విష్ణుదాస్ నామా' అనే పేర్లుకల అభంగ్‌లు కూడా చేర్చబడ్డాయి. ఈ మొత్తం అభంగ్‌లలో నామదేవుడు రచించినవి ఏవి? ప్రక్షిప్తాలు ఏవి? అని పరిశోధించడం చాల క్లిష్టమయిన పని. అయినప్పటికీ భక్త్యుత్సాహం, ప్రతిభా ధోరణి, శైలిలో నిరాడంబరత్వం, భాషలో ప్రాచీనత్వం – ఇలాంటి వాటినిబట్టి నామదేవుడు రచించిన అభంగ్‌లను వింగడించవచ్చు.

స్వయంగా నామదేవుడే తన్నుతాను 'విష్ణుదాస్ నామా' అనీ, 'నామా విష్ణుదాస్' అని సంబోధించుకున్నాడు. కాని 'విష్ణుదాస్ నామా' అనే పేరుతో మహాభారతం రచించిన కవీ, సంత్ నామదేవుడు వేర్వేరు వ్యక్తులు. అతను 16వ శతాబ్దాంతానికి చెందినవాడు. అతను తను విప్రుణ్ణనీ, పండితుణ్ణనీ చెప్పుకొన్నాడు. సంత్ నామదేవుడు ప్రసాద గుణపూర్ణాలూ, ముక్తకాలూ అయిన అభంగ్‌లు మాత్రమే రచించాడు. ఇతను విఠలభక్తుడు. విష్ణుదాస్ నామా ప్రధానంగా శ్రీ కృష్ణునిపట్ల, తదితర దేవతలపట్ల భక్తి ప్రపత్తులు కలవాడు. అతని రచన సహ

జత్వంలో కూడుకున్నదికాదు. నామదేవుడి రచన సహజ ప్రవాహంతో, కొంగ్రొత్త భావాలతో కూడినదయితే, విష్ణుదాస్ నామా భాష పాండిత్య పూర్ణమూ. అంచేత ఇద్దరి రచనల్లో కల వ్యత్యాసాన్ని గుర్తించడం కష్టంకాదు ప్రస్తుతం పరిశోధకులు నామదేవుడు తన కొన్ని అభంగ్‌లలో 'విష్ణుదాస్' అనేది తన పేరుకు విశేషణ రూపంగా వాడాడనీ, మహాభారత రచయిత విష్ణుదాస్ నామా తన పేరుగానే వాడాడని చెబుతున్నారు.

'అశ్వమేధ పర్వం' రచించిన నామాపాఠక్ 4 వ శతాబ్దానికి చెందిన వాడు. అదే విధంగా నామదేవ్ అభంగ్‌లలో 'నామాయాశవంత్' అనే అభంగ్‌లు కొన్ని ఉన్నాయి. వీరిద్దరూ సంత్ నామదేవ్ కంటే భిన్నమయిన వ్యక్తులని భావించాలి.

## నామదేవుడు, జ్ఞానదేవుడు

నామదేవుడు ఒకడా? అనేకులా? అనే వివాదంతోపాటు, ఆయన మహాకవి జ్ఞానేశ్వరుడికి సమకాలికుడా? కాదా? అన్నది వివాదాస్పదమయిన విషయం. ఇదే విధంగా జ్ఞానేశ్వరుడు ఒకడా? అనేకులా? ఆయన అసలు పుట్టాడా? లేదా? అనే విషయంగురించి వాదోపవాదాలు వున్నాయి. భగవద్గీతకు మహత్తరమయిన వ్యాఖ్యాన గ్రంథంగా వెలసిన 'జ్ఞానేశ్వరి' రచించిన జ్ఞానేశ్వరుడు వేరు. 'బాపర్ ఖుమాదేవీవర్'తో అభంగ్‌లు రచించిన జ్ఞానేశ్వరుడు వేరు. వీరిలో అభంగ్‌లు రచించిన జ్ఞానేశ్వరుడు నామదేవుడికి సమకాలికుడు.

జ్ఞానేశ్వరుడూ, నామదేవుడూ సమకాలికులు కాలేరన్నది మరో వివాదం. ఎందుకంటే నామదేవుని భాషకంటే జానేశ్వరుడి భాష ప్రాచీనమయినది. అంచేత నామదేవుడు జ్ఞానేశ్వరుడికి కనీసం ఒక శతాబ్దం తరవాత పుట్టి ఉండాలి. నామదేవుడి అభంగ్‌లలో మహమ్మదీయుల ప్రసక్తిరావడం, ఆయన గురువు విసో(శో)బా ఖేచర్ ఇస్లాంమత సిద్ధాంతానుసారంగా విగ్రహ పూజను వ్యతిరేకించడం మొదలయిన విషయాలను పై వాదానికి ఆధారంగా పేర్కొంటారు. దక్షిణ భారతదేశంలో ఇస్లాము 14 వ శతాబ్దంలో కాని కాలూనలేదు కనుక నామదేవుడు అంతకుముందు పుట్టి ఉండడానికి వీలులేదు అని అంటారు.

నిజానికి జ్ఞానేశ్వరి రచించిన వ్యక్తి, అభంగ్‌లు రచించిన వక్తి వేర్వేరు అనడం అంతస్సాక్ష్యాలు ఆధారంగా నిరాధార మనిపిస్తుంది. కేవలం భాషా శైలి, కొన్ని పైపై సామ్యాలు ఆధారంగా నామదేవుడు జ్ఞానేశ్వరుడికి ఒక శతాబ్దం తరవాత పుట్టి ఉంటాడనుకోవడం కూడా సరికాదు 'జ్ఞానేశ్వరి' రచనా

కాలం 1290 అన్నది నిశ్చితం. 'జ్ఞానేశ్వరి'ని జ్ఞానేశ్వరుడు శిష్యుడు సచ్చిదానంద బాబా వ్రాసాడు. అది భగవద్గీతకు క్రమ బద్ధమయిన వ్యాఖ్య. నామదేవుడి అభంగాలు ముక్తక పద్ధతిలో భావగీతాలవంటివి. జ్ఞానేశ్వరి ప్రచారం గ్రంథ రూపంలో జరిగితే, నామదేవుడి అభంగవాణి మౌఖిక సంప్రదాయంలో ప్రచారం పొందింది. ఈ కారణాలచేత జ్ఞానేశ్వరుడి భాష నామదేవుడి భాషవలె మార్పు లకు–చేర్పులకు లోనుకాలేదు. 'జ్ఞానేశ్వరి' కంటే 'హరిపాఠ్'లో ఉన్న అభంగాల భాషలో మార్పులు-చేర్పులు ఎక్కువగా జరిగాయి జ్ఞానేశ్వరుడు పిల్లలకు కూడా సులభంగా అర్థమయ్యేట్లు రచించడానికి ప్రయత్నించాడు. కాని నామదేవుడికంటె జ్ఞానేశ్వరుడి భాషలో ఇతరులు ఎక్కువమార్పులు చేయలేదు. నామదేవుడి అభంగ్ రచనల భాష కాలక్రమంగా మారుతూ వచ్చింది.

14 వ శతాబ్దానికి ముందు దక్షిణ భారతదేశంలో ఇస్లాంమతం, మహమ్మ దీయ రాజ్యం స్థిరపడలేదన్నమాట నిజం. కాని జ్ఞానదేవుడి కంటే నామదేవుడికి 50 సంవత్సరాల వయస్సు ఎక్కువ లభించింది. కనుక ఆయన అభంగాలలో 'తురకల', మహమ్మదీయుల ప్రసక్తిరావడం స్వాభావికమే. ఒక అభంగ్‌లో ఆయన ఇలా అంటాడు.

'దేవుడు రాతి విగ్రహం
భక్తుడు మమతారూపం
ఇద్దరి సందేహం ఎలా తగ్గుతుంది?
అలాంటి దేవతా విగ్రహాలను ముక్కలు చేసారు.
నీటిపాలు చేసారు
నామదేవుడు కేశవుడితో నివేదిస్తున్నాడు
నీలాంటి దేవుడు నాకు కనిపించలేదు.'

నామదేవుడి గురువు విఠోబా ఖేచర్ విగ్రహారాధనను ఖండించడానికి కారణం ఇస్లాంమత ప్రభావం కావచ్చు లేకపోతే కేవలం సగుణోపాసనలో మగ్నుడయి ఉన్న నామదేవుడికి నిర్గుణోపాసనా రహస్యాన్ని తెలియపరచడానికి, ప్రతీకాత్మంగానే కానివ్వండి, విగ్రహారాధన వ్యర్థమని ప్రతిపాదించి ఉండ వచ్చు.

జ్ఞానదేవుడి రచనల్లోనూ, నామదేవుడి రచనల్లోనూ కల కల్పనా సామ్యం, శబ్ద సామ్యం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. వారు తమ తమ అభంగాలలో పరస్పరం

ఒకరినొకరు ఉటంకించుకున్నారు. సమకాలీన సాధువులు కూడా ఇద్దరిని జతగా ఉటంకించడం గమనార్హం. ఈ విషయాలన్నింటిని పరిశీలిస్తే వారిద్దరూ సమ కాలీనులే కాకుండా, ఆత్మీయ సంబంధం కలవారని చెప్పాలి.

నామదేవుడికి, జ్ఞానదేవుడికి ఎప్పుడు, ఎలా సాంగత్యం కలిగిందనే విష యంలో పరంపరానుగతంగా వస్తున్న అభంగ్‌లు ఆధారంగా చాలా కథలు ప్రచారంలో వున్నాయి. చరిత్రదృష్ట్యా ఈ కథలన్నింటిని యథాతథంగా నమ్మ డానికి వీలులేదు. ఈ కథల్లో చాలావాటిలో పరస్పరం పొంతనలేదు. కాని మొత్తంమీద ఈ కథల మూలకంగా నామదేవుడి జీవితం - భావనాజగత్తు, కావ్య కర్తృత్వాలు - గురించి స్థూలరూపంగానైనా, చాలా విషయాలు తెలుస్తాయనడంలో సందేహం లేదు.

## సాధుమండలి

క్రీ॥ శ॥ 1290 లో జ్ఞానేశ్వరి రచించబడింది నివృత్తి జ్ఞానదేవ్, సోపాన్, ముక్తాబాయి - ఈ నలుగురూ నేటి పూనానగరానికి సమీపంలో కల 'ఆళందీ'లో వుండేవారు. వారి లౌకిక, అలౌకిక చమత్కార కృత్యాల ప్రసక్తి నామదేవుడి చెవులపడ్డది. ఆళంది వెళ్ళి వారి దర్శనం చేసుకోవాలన్న అభిలాష కలిగింది 'జ్ఞానేశ్వరి' రచించబడి అప్పటికి ఒకటి - రెండు సంవత్సరాలు అయివుంటుంది. ఆనాటికి జ్ఞానేశ్వరుడు 15-16 ఏండ్ల వయస్సువాడు, నామదేవుడికి 20-21 ఏండ్లు వుండివుంటాయి. ఈ నలుగురిని కలుసుకున్న ఉదంతాన్ని నామదేవుడు తన ఆత్మ కథాత్మకాలయిన అభంగాలలో వర్ణించాడు. అవి నామదేవుడి సాధనావస్థకి ప్రతిభాయుక్త మయిన కావ్యశైలికి యథాతథంగా ప్రాతినిధ్యం వహిస్తాయి.

ఆళందికి రాగానే నామదేవుడు మొదట నివృత్తి నాథుణ్ణి దర్శించాడు.

'నివృత్తి లేచి సాధుదర్శనానికై వచ్చాడు
పండరిపట్ల ప్రేమ ఉవ్వెత్తుగా వచ్చింది
ప్రదక్షిణ చేసాడు, చరణాభివందనం చేసాడు
నామదేవుడికి అహంకారం పెరిగింది
నేను నిరంతరం దేవుడిదగ్గర ఉండేవాణ్ణి
నాలో నమస్కారం పొందే యోగ్యత ఉంది.
నిత్యం హరిచరణ సమాగం మాకు
ఇద్దరమూ హరిభక్తులమే.

నేను ఆయనకు పాదాభివందనం ఎందుకు చేయాలి?
(అని అంటాడు నామదేవుడు)
పరబ్రహ్మయే సాక్షాత్తు నా శరీరంలో ఉన్నాడు.'

నిజానికి నివృత్తినాథుడు నమస్కరించిన తరవాత నామదేవుడు నమస్క రించాలి. కాని ఆయనలో దర్పం అంకురించింది. నేను నిరంతరం పండరి పురంలో భగవత్సాన్నిధ్యంలో వుంటాను. అంచేత మేమిద్దమూ దైవభక్తిలో సమానులమే. అయన నాకు నమస్కరించాడంటే అది ఆయన కర్తవ్యం. కాని నాలో సాక్షాత్తు పరబ్రహ్మయే వుండగా, నేను ఆయనకు ఎందుకు నమస్క రించాలి?

నివృత్తినాథుడి తరవాత జ్ఞానేశ్వరుడు నామదేవుడికి నమస్కరించాడు.

'జ్ఞానేశ్వరుడు లేచి వందనం చేసాడు
పాదాభివందనం చేశాడు
నేను పెద్దరికానికి యోగ్యుణ్ణని అంటాడు నామా
నమస్కారం పొంద తగ్గవాణ్ణి
ఎల్లప్పుడూ దైవసాన్నిధ్యంలో ఉండేవాణ్ణి.
ఇక్కడకు వస్తే అందరూ నాకు నమస్కరిస్తారు.
వైష్ణవులను కాపాడి రక్షించే బాధ్యత
దేవ సురగణాలది.
ఏకైక శరణ్యం పండరిపురం.
సాధుమండలిని చూసి
స్వయంగా వనమాలి కృష్ణుడే
ఆనంద విహ్వలుడయినాడని నామా అంటున్నాడు.'

నామదేవుడు జ్ఞానదేవుడి కంటే ఐదు ఏండ్లు పెద్దవాడు. కనుక ఇలా వారు పాదాభివందనాలు చేయడం నామదేవుడికి స్వాభావిక మనిపించింది. మరి పిన్నలు పెద్దలకు నమస్కారం చేయడం ఆచారం కదా! ఆ తరవాత సోపాన దేవుడు కూడా తన అన్నలను అనుసరించాడు.

'సోపానుడు వచ్చాడు, పాదాభివందనం చేసాడు.
నామదేవుడే పాండురంగడని సత్కరించాడు.

కుశలప్రశ్న లడిగాడు
పండరిదేవుడు నాథ - అనాథులకు తల్లి వంటివాడు.
మము కన్నవారు ఈనాడు మా ముందు వచ్చారు,
సహజాలింగనంతో మాకు శాంతి లభించింది.
వీరి ప్రేమ గాంభీర్యం ఈనాడు తెలిసివచ్చింది.
దేవతలు పడే శ్రమ తక్కువది కాదంటాడు నామా.'

సోపానదేవుడి భక్తిభావం నామదేవుడికి తెచ్చిపెట్టుకున్న భావం వలె తోచింది. పై ఇద్దరితో పాటు వీణ్ణికూడా ఎందుకు పంపిచారనుకుంటాడు. నివృత్తి, జ్ఞాన, సోపానదేవుల తరవాత ముక్తాబాయి వంతు వచ్చింది. తన పెద్దన్నగారికి నామదేవుడు ప్రతినమస్కారం చేయకపోవడం ఆమెకు చాలా బాధ కలిగించింది. ఒక దెబ్బకు రెండు చెక్కలనేది ఆమె పద్ధతి. ఆమె స్పష్టంగా కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడే మనిషి. ఆమె ఇలా అన్నది.

'నిరంతరం భగవత్సాన్నిధ్యం లభించినవాడయితే
అహంకారం ఎందుకు పోలేదు?
గౌరవమర్యాదలనే భావం ఈర్ష్యాద్వేషాలను పెంచుతుంది.
పరబ్రహ్మతో నిత్యం కేళీవిలాసం జరిపేవాడివి
పగటివేళలో చేత దీపం ఎందుకు?
గుడ్డివాడికి కండ్లు కావాలనే కోరిక ఎందుకు?
కల్పతరువు నీడన ఉన్నాను,
ఏది కావాలంటే అది లభిస్తుందనే వాడివి
చేతిలో భిక్షాపాత్ర ఎందుకు?
ఇంటిలో కామధేనువుండగా
మజ్జిగ అడుక్కునే తలకు మాసిన వాడెవడుంటాడు?
నేను దర్శనానికి వెళ్ళనని ముక్తా అంటున్నది.
ముందు గర్వాన్ని తొలగించుకోమను.'

ముక్తాబాయి మొండిపట్టుదల చూసి, పెద్దన్న ఆమెకు ఎంతగానో నచ్చ చెబుతాడు. నామదేవుడు భక్తితో భగవంతుణ్ణి జయించాడు, భగవంతు డాయనకు ఋణపడి ఉన్నాడనీ, భక్తిని మించినది ప్రపంచంలో లేదనీ చెబుతాడు. కాని

ముక్తాబాయికి ఆయన మాటలు నచ్చలేదు. నామదేవుడు ఎంత మహాభక్తు డయినా అతనికి అంతర్జ్ఞానం కలగలేదు. ఈ విషయాన్ని గురించి తర్కిస్తూ, ముక్తాబాయి ఇలా అన్నది.

'మాటలతో తన్ను గురించి మహాప్రచారం చేసుకున్నారు
పైన పటారం లోపల లొటారంలా ఉన్నారు.
గురువు లేకపోవడంతో ఏమీ తెలియని వాడయినాడు.
సాధువులను గౌరవించలేనివాడు
భగవంతుని సాన్నిధ్యంలో ఉంటే మాత్రం ఒరిగిందేమిటి?
పాదరసం మట్టిమూకుడులో ఉంటేమాత్రం
దాని కొలమానం తగ్గుతుందా?
నిప్పు కణికలను కప్పిపెడితేమాత్రం
లోని వేడి నశిస్తుందా?
ముక్తాబాయి అంటున్నది
గర్వం ఇలా చేయించింది
సర్పానికి విషం పోసినట్లయింది.'

'అమృతం కాక గంజి ఇష్టమయినవాడికి
పరమాన్నం నచ్చుతుందా?
గాడిదను అఖండ గంగాస్నానం చేయించినా
దాని బ్రతుకు వ్యర్థం కదా?
ప్రవాళమణుల కంటే, అడవిలోని గురివిందలు నయం
కాని అలంకరణకు పనికిరావు కదా!
ఇంద్రావన ఫలం దానిమ్మపండు కంటే చూడ చక్కనిది
కాని నాలికమీద పెట్టుకుంటే చేదు, హీనం.
రంగులబొమ్మ అందంగా కనబడుతుంది
కానీ, నకిలీ నగలతో
ముక్తాబాయి అంటుంది
అవసరం లేదు నాకు అతని దర్శనం.
గురువు లేని సాధుత్వం వ్యర్థం.'

ముక్తాబాయి అభిప్రాయానుసారం నామదేవుడు చందనవృక్షం లాంటి వాడు. ఆ చందన వృక్షాన్ని అహంకారమనే సర్పం చుట్టుకుంది. నామదేవుణ్ణి గౌరవిస్తే, అతనిలో గర్వం ముంచుకోస్తుంది. అతను నలుగురికి పండరిపుర మాహాత్మ్యన్ని తెలుపుతాడు. కాని ఆతనిలో నువ్వుగింజంతయినా జ్ఞానం లేదు. ముక్తాబాయి అంచనా ప్రకారం నామదేవుడి పరిస్థితి చాంగ్‌దేవుడి లాంటిది. అంచేత అందరూ కలిసి అగ్నిలో పడవేసి పరిశుద్ధుణ్ణి చేయాలి. అదే తగిన ఉపాయం.

'అలా అనబోకని నివృత్తినాథుడంటాడు
సాధు మహాత్ముల రాక, మన జన్మలకు సార్థకత.
మనకు మేలు మనమే చేసుకోవాలి
సాధు సత్కారంలో లోపం జరగకూడదు.
పండరిపురంలో ఉండేవారు ధన్యులు
వారింట కుక్క అయి పుట్టడం మేలు.
ఈ నామదేవుడిపై దేవుడికి ప్రేమ
ఆ ప్రేమతోనే పాండురంగణ్ణి పిచ్చివాణ్ణి చేసాడు.
అతణ్ణి నీచంగా చూడబోకుమని అంటాడు నివృత్తి
అతనికి పాదాభివందనం చేయడం మేలు.'

ఈ విషయం గురించి నలుగురిలో బాగా వాగ్వాదం జరిగిన తరవాత నామదేవుడి అహంకారము పోగొట్టాలనే నిశ్చయానికి వస్తారు. ఇంతకుముందు తన యోగసామర్థ్యాన్ని గురించి బడాయిలు కొట్టే చాంగ్‌దేవుడి గర్వం పోగొట్టారు. చాంగ్‌దేవుడు మొదట్లో హఠయోగి. నామదేవుడి వలెనే అతడూ ఈ నలుగురిని గురించి విని, జ్ఞానదేవుడికి ఒక ఉత్తరం వ్రాద్దామనుకున్నాడు, కాని ఉత్తరంలో జ్ఞానదేవుణ్ణి 'తీర్థస్వరూపా' (తండ్రీ!) అని సంబోధించాలో 'చిరంజీవీ' (పుత్రా!) అని సంబోధించాలో నిశ్చయించుకోలేక పోయాడు. సంబోధన లేకుండానే ఉత్తరం వ్రాసేసాడు 'ఇంత యోగసామర్థ్యం కలిగి ఉండీ' చాంగ్‌దేవుడు దద్దమ్మే'నని ముక్తాబాయి వెక్కిరించింది. అతని గర్వం పోగొట్ట డానికి జ్ఞానేశ్వరుడు అతనికి అద్వైత జ్ఞానాన్ని ప్రసాదించాడు. అది 'చాంగ్‌దేవ్ పాసష్ఠీ' (65 నీతి వాక్యాలు) అనే పేరిట ప్రసిద్ధం. ఆ తరవాత ముక్తాబాయి అతణ్ణి శిష్యుడిగా స్వీకరించి, ఉపదేశం చేసింధి.

చాంగ్ దేవుడికి హఠయోగసిద్ధి పట్ల అహంకారం కలిగినట్లే, నామదేవుడికి విఠల! ప్రేమపట్ల అహంకారం కలిగిందని ముక్తాబాయి గ్రహించింది. నామదేవుడి గర్వనివారణభారం ఎవరికి అప్పగించాలని వారు నలుగురూ కలిసి ఆలోచించారు. నేటి ఉస్మానాబాదు జిల్లాలో 'తేరాఢోకి' అనే గ్రామంలో నివసించే గోరోబా కుమ్హార్‌కు ఆ సంవత్సరం జరిగే 'సంత్‌మేలా'లో, ఈ పని అప్పగించాలని నిర్ణయించారు.

ఆ యుగంలో మహారాష్ట్రలోని అనేక ప్రాంతాలలో సాధుపుంగవులు ఉండేవారు. నామదేవుడికి సమకాలికు లయిన జ్ఞానేశ్వరాదులు పైఠణ్ దగ్గర ఉన్న ఆపేగాంవ్‌లో ఉండేవారు. నామదేవుడి దాసి జనాబాయి, నరహరి సునార్, పర్సాభాగవత్‌లు పండరిపురంలో, బార్షీలో జోగా పరమానంద్, అరణఘేండీలో సాంవ్‌తామాలి, మంగల్‌వేఢీలో చోఖామేలా, ఆం వధ్యానాగనాథ్‌లో విసోబాఖేచర్ ఉండేవారు. ఈ సాధుపుంగవు లందరిలో గోరోబా ఉత్తముడూ, శ్రేష్ఠుడూ. అంచేత ఆయన్ను గోరోబా కాకా అని పిలిచేవారు.

గోరోబా కుమ్మరివాడు. ఆయన దగ్గర అనుభవం అనే చెక్కపేడు ఉండేది. కుండ గట్టిదో, ఓటిదో తెలుసుకోవడానికి, చెక్కతో కొట్టి చూస్తారు. నామదేవుడి కుండ గట్టిదో, ఓటిదో తెలుసుకోవడానికి గోరోబా కాకాను పిలిపించాలని నిశ్చయించిన తరవాత, ఆయన్ను పిలుచుకోరావడానికి స్వయంగా ముక్తాబాయి వెళ్ళింది. వారి కలయికను నామదేవుడు అద్వితీయంగా వర్ణించాడు.

'ముత్యాల పొడి ఆకాశంలో చల్లింది
మెరపులా అది మెరసిపోయింది.
జరీపీంతాంబరం ఆకాశం ధరించిది.
చైతన్యగర్భం నీలబిందువు
మండుతున్న కాగడాస్పర్శతో శూన్యాకారమయింది.
సర్పసంతానం కూడా నృత్యం చేయసాగింది.
ఉరుముతున్న మెరుపులు కూడా ఘనీభవించాయి.
ముక్తా గోరోబాను కలుసుకుంది.
అది ఆత్మీయతను ఆత్మీయత గుర్తించినట్లుందని
నామదేవుడు అంటున్నాడు.'

పరీక్ష

ఈ విధంగా గోరోబా ఆళందీ వచ్చాడు. అక్కడ కూడిన సంత్ (సాధు) మండలిలో ఒక్కొక్కరిని తన చెక్కతో కొట్టి పరీక్షించసాగాడు. మొదట నివృత్తినాథుడు, ఆ తరవాత జ్ఞానేశ్వరుడు, సోపానుడు, ముక్తాబాయిని పరీక్షించాడు. ప్రతివారు ఆ దెబ్బకు తట్టుకొని తాము పరిపక్వదశకు చేరుకున్నామని తెలుసుకున్నారు. తరవాత నామదేవుడి వంతు వచ్చింది.

'అదే చెక్క నామదేవుడి తలమీద పడ్డది.
తల పట్టుకొని అతడు ఏడ్వసాగాడు.'

అది గమనించి గోరోబా ముక్తాబాయితో ఇలా అన్నాడు.

'గోరా అంటున్నాడు
అమ్మా! ఇది గట్టి కుండ కాదు
లేశమాత్రం కూడా గట్టిపడలేదు.'

ఆ సమయంలోని తన మానసిక పరిస్థితిని గురించి నామదేవుడు ఇలా వ్రాసుకున్నాడు.

'ఉద్విగ్న మనస్కుడనయి నిట్టూర్పులు విడుస్తూ
ఓ సఖుడా! నాకు నా వారెవరూ లేరని అన్నాను.
వైరాగ్యం అనే గీటురాయి దెబ్బ సహించలేను
పారిపోవడానికి కాళ్ళు సిద్ధమవుతున్నాయి
మనస్సు నిలకడలేకుండా అయింది
క్షణమొక యుగంలా గడుస్తున్నది
ఇక్కడినుండి పారిపోతానని నామా అంటున్నాడు
వీళ్ళు నన్ను నిప్పుల్లో పడత్రోసేట్టున్నారు.'

అక్కడ ఉన్న సాధువుతో చెప్పకుండానే నామదేవుడు ఆళందీ విడిచి వెళ్ళిపోయాడు. ఇంద్రావర్ణీనది దాటి, ఉరుకులూ – పరుగుల మీద పండరిపురం చేరుకున్నాడు. విఠోబాతో ఇలా ఫిర్యాదు చేసాడు.

'విఠలుణ్ణి కౌగలించుకొని ఇలా అన్నాడు
నివృత్తి చేతుల్లో నన్ను పెట్టకు

జ్ఞానదేవుడు, సోపానుడు
ఆ మూడు కాళ్ళ ముసలి (గోరోబా) నిప్పుకణికలు.
ముక్తాబాయి అక్కడ నిప్పంటించింది.
ఆ సంత్‌మండలి కాపట్యంతో కూడినది.
నామా అంటాడు.
అదృష్టంకొద్ది బ్రతికి బయట పడ్డాను
లేకపోతే నిలువునా తగలబెట్టి ఉండేవారు '

పరస్పరం కలహించుకునేవారు, ఇతరుల ఇంటికి నిప్పు పెట్టేవారు, కాపట్యంతో కూడినవారు ఈ సంత్‌మండలి వారని దూషించి, అంతటితో తృప్తి పడక, అది కైకాడ్ (దుష్టుల) మండలి అని అంటూ, నామదేవుడు ఇలా అంటాడు.

'వైశ్యులు కైకాడ్ హూక్కా తయారుచేస్తారు
ఈ రహస్యం నా బుర్ర కెక్కలేదు.
నామా అంటాడు
వీరు వెలుగుపాటలు పాడతారు కాని
నాకు అఘోరీలవలె కనిపించారు!

నామదేవుడు జ్ఞానేశ్వరాదుల కవిత్వాన్ని 'వెలుగుపాట' (ప్రకాశ్ కా గానా) అన్నాడు. ఇది శ్రేష్ఠుడయిన ఒక కవి మరో కవిని అభివర్ణిస్తూ చెప్పిన సార్థక మయిన ప్రశంసావాక్యం, ఒకవైపు దూషిస్తూనే, మరోవైపు జ్ఞానదేవుణ్ణి గురించి ఎంత అభిజ్ఞతను వెల్లడించాడో, చూడండి.

'మేము ధాన్యాగారం కలవారమంటారు
ఖర్చుకు చిల్లిగవ్వయినా లేదు.
నవ్వుతూ - పేలుతూ ఒకరిమీద ఒకరం పడతాం
అంతులేని ఆనందం పొందుతామంటారు.
ఏ గుణం చూసి ఆ భగవంతుడు మురుస్తున్నాడో.
జీవితం అంతా చిరుగులతోనే గడుపుతారు.
దారిద్ర్యం చూసి చాలా బాధ కలిగింది,
పండరియే పరుసవేది.

చిన్నది ముక్తా, గోగుపుల్ల లాంటిది
దేశబహిష్కారం పొందితేమాత్రం ఏం?
సమస్త జగత్తు వారి ఒడిలోనే ఉన్నది.
నామా అంటాడు
నాకు ఇదంతా పాషండ మనిపిస్తున్నది.

## గురూపదేశం

నామదేవుడు సత్వపరీక్షలో నెగ్గలేదు. పండరిపురం చేరుకొని, అంతర్ముఖుడయి ఆలోచించసాగాడు. క్రమక్రమంగా ఆయనకు తన లోపాలు కనిపించసాగాయి.

'సాధు సజ్జనుల పట్ల వైముఖ్యం కలవాడు
ఇహ – పర లోకాలకు దూరుడు,
సాధువులను అనుసరించలేని మూర్ఖుడు
అజ్ఞానమనే నిద్రలో తన్మతా మరుస్తాడు
మాయలో పడి మునిగినవాడికి,
భ్రమజాలంలో చిక్కుకున్నవాడికి
సజ్జనుల మాటలు విషతుల్యాలు.
లభించిన దాన్ని చేజేతుల జారవిడుచుకున్నాడు
మోహసర్ప ప్రభావం నిన్ను ఆవరించుకున్నది
ఇప్పుడు పాండురంగని స్మరిస్తే ఒరిగేదేమిటి?'

సద్గురువు శరణు పొందకపోతే భగవత్ప్రాప్తి నాస్తి అనే విషయం నామదేవుడికి తెలిసివచ్చింది.

'సద్గురు సేవాభాగ్యం లేనన్నాళ్ళు
'అహం' అన్నది కలలోని బంగారం,
సద్గురు ఆజ్ఞలేనిదే
నా భవబంధాలు తొలగవు.'

భగవత్ప్రేరణ కలగడంతో ఆయన అవంద్యా నాగనాథ్ నివాసి అయిన విసోబాఖేచర్ వద్దకు గురూపదేశం పొందడానికి వెళ్లాడు. ఈ నాగనాథ్ అనేది ప్రాచీనదారుకా వనంలోని నాగేశ్ అనే ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటి,

అక్కడ నామదేవుడికి విసో (తో) బాఖేచర్ దర్శనభాగ్యం లభించింది. కాని ఆ సమయంలో ఖేచర్ ఏం చేస్తున్నారు? సాక్షాత్తు ఆలయ లింగంమీద కాళ్లు పెట్టుకొని నిద్రపోతున్నా డాయన. ఈ విధంగా తన భావి గురువును దర్శించి నామదేవుడు ఆశ్చర్యచకితు డయ్యాడు. అలా హాయిగా నిద్రపోతున్న ఖేచర్‌తో నామదేవుడు ఇలా అన్నాడు:

'లేలే మానవా!
గుడ్డివాడివా?
భగవంతుడి నెత్తిన
కాళ్ళుపెట్టి నిద్రపోతున్నావు?'

విసోబా తక్కువ తిన్నవాడా? నామదేవుడితో ఇలా అన్నాడు:

'నా ప్రాణాలను ఎందుకు మేల్కొల్పావు?
ఈశ్వరుడు లేని తావెక్కడ?
ఆలోచించు నామదేవా!
ఈశ్వరుడు లేనిచోట నా కాళ్ళుంచు.
ఈ వాక్య తాత్పర్యాన్ని పూర్తిగా గ్రహించు.'

నామదేవుడు నలువైపులా దృష్టి సారిస్తే ఏం కనబడింది?

'నామదేవుడు ఎటు చూచినా
భగవంతుడే కనిపించాడు
అతడు లేని తావే లేదు.'

విసోబాఖేచర్ సాన్నిధ్యంలో నామదేవుడికి దివ్యదృష్టి లభించింది. విసోబా శిష్యుడికి ఇలా ఉపదేశించాడు.

'నామరూపాలు లేనివాడు భగవానుడు
అది తప్పించి మిగతాదంతా మిథ్య.
జలస్థలాలలో, అండపిండాలలో, అణువణువులో
అతనే సాక్షీభూతుడయి వ్యాపించి ఉన్నాడు.
ఇది తెలిసి తన్నుతా తెలుసుకున్నవాడు ధన్యుడు.
సర్వం ఈశ్వరమయమని ఖేచర్ అంటున్నాడు

ఇలా చెవిలో ఉపదేశించి, శిరస్సును స్పృశించి
పద – పింఠ – వివర్జితుణ్ణి చేశాడు నామదేవుణ్ణి.'

అంటే జీవుడు - బ్రహ్మ ఈ భేదభావాన్ని పోగొట్టి, అతణ్ణి కేవల బ్రహ్మ రూపుణ్ణి చేసాడు. విసోబాఖేచర్ ఉపదేశాన్ని, తద్వారా నామదేవుడికి లభించిన జ్ఞానదృష్టిని జ్ఞానదేవుడి ఈ 'ఓవీ' తో పోల్చిచూడండి.

'రాగద్వేషాలు నశించినపుడే బ్రహ్మస్వారాజ్యంలో ప్రవేశం
తరవాత అతడే సుఖదుఃఖాలకు భోక్త
గురుశిష్యుల గోష్ఠిలో, అంఠ బ్రహ్మాండవాదంలో
ఎప్పుడూ స్థిర సుఖానికి లోపం లేదు. (జ్ఞానేశ్వరి 13-50)

నామదేవుడి మూఢభక్తికి గురూపదేశం జ్ఞాననేత్రాన్ని ప్రసాదించింది. తన భక్తిని సార్థకం చేసిన గురువును నామదేవుడు అనేక విధాలుగా స్తుతించాడు.

'సద్గురు మహారాజు సంపూర్ణమయిన దయ చూపించాడు
నాకు నా వస్తువును చూపించాడు.
నా సుఖాన్ని నా కండ్లకు చూపించాడు
ప్రేమ కళ అనే ముద్ర వేసాడు
ఆ ఋణాన్ని ఎలా తీర్చుకునేది?
జన్మరాహిత్యాన్ని ప్రసాదించా డిప్పుడు
సులభ మార్గాన్ని చూపించాడు
ఆ గురు చరణారవిందాలను మరవలేను '

సాధనావస్థలోనే గురూపదేశ ప్రభావం గురించి పరీక్షలు సాగాయి. ఒకసారి నామదేవుడు భోంచేస్తుండగా, ఒక కుక్క అయన ముందున్న రొట్టె ఎత్తుకొని పోయింది. కాని 'సర్వ ప్రాణుల్లో భగవంతుణ్ణి దర్శించుకున్న' నామదేవుడు చేతిలో నేతిగిన్నెతో, ఇలా అంటూ, దానివెంట పరిగెత్తాడు. 'నేతిలేని రొట్టె తినబోకు, నెయ్యిలేని రొట్టె అరగదు నీకు, కడుపునెప్పి పుట్టగలదు.' ఇలా 'సమదర్శనం' కలగడంతో ఆయన నోటివెంట అప్రయత్నంగా ఈ పంక్తులు వెలువడ్డాయి.

'కీర్తనలో ఒళ్ళు మరిచి నర్తించాలి,
జ్ఞానదీపాన్ని జగత్తులో వెలిగించాలి.

అందరికి అధిష్టాన దేవతయే
నా పూర్ణరూపం.
నామదేవుడికి ప్రసాదించాడు ఖేచర్
ఇప్పుడు ఆ శక్తి నా చేత ఉంది.'

## మొదటి తీర్థయాత్ర

జ్ఞానదేవుడూ, తదితర సాధువుల సాంగత్యంలో నామదేవుడు దాదాపు 7 - 8 సంవత్సరాలు గడిపాడు, ఆ కాలంలో పండరిపురం నుండి ఆళంది వరకు గల మహారాష్ట్రదేశం నామదేవుడి సంకీర్తనలతోనూ, జ్ఞానేశ్వరుడి ప్రవచనాల తోనూ మార్మోగిపోతూ ఉండేది. అదేసమయంలో నామదేవుణ్ణి కలుసుకోవడానికి జ్ఞానదేవుడు పండరిపురం వచ్చాడు. అప్పుడు అన్ని తీర్థస్థానాలు పండరిపురంలోనే ఉన్నాయని నామదేవుడి నమ్మకం. ఆయన ప్రేమభక్తి, తీర్థయాత్రలపట్ల ఆసక్తి లేకపోవడం - జ్ఞానదేవుడికి నచ్చింది. ఆయన ఇలా అన్నాడు :

'శ్రేష్ఠుడివి, చతురుడివి, అతి ఉదారుడివి,
ప్రేమభక్తి నీలో శోభిల్లుతున్నది.
ప్రపంచంలో ఉండి కూడా నీవు భక్తిభావ శిలుడివి
ప్రేమ సుఖాన్ని సాధించినవాడివి.'

కాని నామదేవుడు అంతర్ముఖుడై, సాక్షాత్తు పరబ్రహ్మమూర్తి అయిన జ్ఞానేశ్వరుడు తన సాంగత్యాన్ని అభిమానిస్తున్నాడంటే, ఆటువంటి అదృష్టాన్ని నోచుకోవడానికే విష్ణుదాసుడు జన్మించాడని అనుకున్నాడు. ఆ ప్రత్యక్ష భగవానుడే 'వెళ్ళు, క్షేమంగా వెళ్ళు, స్వహితార్థం అనుకొని తీర్థయాత్రావ్రతాన్ని పాటించు,' అని తీర్థాటన చేయమని ఆదేశించాడు. ఇలా అని నామదేవుడు జ్ఞానేశ్వరునిపట్ల తన ప్రగాఢమయిన ఆత్మీయతను ప్రదర్శించాడు.

'నిర్గుణప్రియుడు నామదేవుడు అమాయకుడు
ప్రయాణంలో ఇరువైపులా అతణ్ణి కనిపెట్టి ఉండు
అటవుల్లో, జనసందోహంలో అతడికి సహాయం కావాలి.
నీ ఆర్తి చూసి పంపిస్తున్నాను.'

అని జ్ఞానదేవుడు పరమాత్ముణ్ణి ప్రార్థించాడు. కాని చివరకు జ్ఞానరూపకుడయిన దేవుడు, నామరూపకుడయిన దేవుడు ఇద్దరూ చెట్టపట్టాలు కట్టి, ఇతర భక్తులతో పాటు తీర్థయాత్రలకు బయలుదేరారు.

'చిడతలు, మృదంగం, వీణ – సుస్వరంతో
ఆకాశం మార్మోగిపోయింది.
కరతల ధ్వనుల సమవేతస్వరం
అనంతంగా ఆకర్షించింది.'

ఈ భక్తమండలితో తన తీర్థాటనను గురించి నామదేవుడు 'తీర్థావళి' అనే పేరిట అభంగాలలో విస్తారంగానూ, హృద్యంగానూ వర్ణించాడు.

## చమత్కారాలు

నామదేవుడు రచించిన 'తీర్థావళి' కాక స్వీయ జీవిత కథనానికి సంబంధించిన అభంగాలన్నీ దాదాపు ముక్తకాలే. అవి ఆ నోటా - ఆ నోటా పాడబడుతూ వచ్చినవే. అందుచేత కాలక్రమానుసారంగా, ఎన్నో మార్పులకు - కూర్పులకు లోనయ్యాయి. కాబట్టి ఆ అభంగాలన్నింటినీ ప్రామాణికాలని ఎంచడానికి వీలు లేదు. కాని వాటిలోని కావ్యగుణం అప్రతిమానమయినది. వాటిలో శాంతం - భక్తి - అద్భుత రసాలు అలౌకికంగా పోషించబడ్డాయి. ఈ అభాంగాలు ఆధారంగా వ్రాయబడ్డ నామదేవుడి జీవితచరిత్ర పరస్పరం విరుద్ధవిషయాలతోనూ, చమత్కార బాహుళ్యంతోనూ కూడుకొని ఉన్నది. ఏమయినా, ఈ అభంగాలు ఆధారంగానూ, అతని సమకాలికులు చెప్పిన విషయాలు ఆధారంగానూ నామదేవుడి జీవితక్రమాన్ని యుక్తియుక్తంగా ఊహించవచ్చు.

నామదేవుడు జ్ఞానేశ్వరాది భక్తులతో కలిసి తీర్థయాత్రలు చేసాడు. అవి ఆయన వ్యక్తిత్వవికాసానికి ఎంతగానో తోడ్పడ్డాయి. అప్పటిదాకా ఆయన భక్తి ప్రపత్తులు పండరిపురంలోని విఠలదేవుని వరకే పరిమితమయి ఉండేవి. ఇప్పుడు వాటికి మహారాష్ట్ర దేశానికి బయట కూడా వ్యాపించడానికి అవకాశం లభించింది. సాధువుల సాంగత్యంలో ఉండి ఉత్తర భారతదేశంలోని వివిధ ప్రాంతాలను ఆయన దర్శించాడు. పండరిపురంలో బయలుదేరి ఆయన ద్వారక వెళ్ళాడు. ప్రభాస తీర్థం దర్శించుకొని, మార్వాడదేశం వెళ్ళాడు. అక్కడ బీకానేరు దగ్గర కోలాడ్జీ అనే గ్రామంలో నీటికి కరువుగా ఉండేది. నామదేవుడు తన భక్తి ప్రభావంతో

లోతయిన బావినుండి జలధారను పైకి తెప్పించి, అక్కడ ఒక సెలయేరుగా ప్రవహించేట్టు చేసాడు. ఆ సమయంలో స్వయంగా జ్ఞానదేవుడే నామదేవుణ్ణి పొగడ్తలతో ముంచెత్తాడు. ఆయన ఇలా అన్నాడు:

'ఋషులు, గంధర్వులు, బ్రహ్మాదులు
ఆ నిరాకారుడి నెలవెక్కడ అని వెతుకుతూ ఉంటారు.
నీవు అతణ్ణి మా ముందుంచావు
నీ చరణాలకు మొక్కుతున్నాడు జ్ఞానదేవుడు.'

ఆ బావికి ఇప్పటికి 'నామదేవ కూపము'ని పేరు.

ఆ తరవాత ఆ తీర్థయాత్ర ఉత్తరంనుండి దక్షిణంవైపు ఆవంధ్యా నాగనాథ్‌కు చేరుకుంది. అక్కడ నాగనాథ్ దేవాలయం ముందు నామదేవుడి భజనకార్యక్రమం జరుగుతుండగా, అక్కడి బ్రాహ్మణుల కది నచ్చక, ఆయనను గుడి వెనకభాగానికి తరిమివేసారు. ఆయనతో పాటు ఆయన సహచరులు కూడా గుడి వెనకభాగానికి చేరుకున్నారు. కాని నామదేవుడి సమాధిస్థితిలో ఎటువంటి మార్పూ రాలేదు. అది బ్రహ్మానంద దశకదా! గుడి వెనుకభాగంలో కూడా భజన కార్యక్రమం యథాతథంగానే సాగింది. ఈ విషయం జ్ఞానదేవుడికి తెలిసింది, ఆయన ఆర్తితో భగవంతుణ్ణి ప్రార్థించాడు. ఇంతకు ముందు ఒకసారి ఒక సుల్తాను నామదేవుణ్ణి పట్టి బంధించి, తన దర్బారుకు రప్పించి, ఆయన కండ్ల ఎదుట ఒక ఆవును చంపించాడు. అది నామదేవుడి భక్తిసామర్థ్యం కారణంగా మళ్ళీ బ్రతికింది. అలాగే ఒక బావినుండి జలధార తెప్పించాడు. ఈ విషయాలను స్మరించుకుంటూ నామదేవుడిలా అన్నాడు:

'ఇప్పుడు ఎందుకు ఇంత కాఠిన్యం వహించావు?
విఠలా! వేగం రావయ్యా.
నా వైపు విముఖుడై ధూర్జటి కూర్చున్నాడు
నన్ను దయాదృష్టితో కాపాడవయ్యా!
జగత్తుకు పితృదేవుడే నాకు లభించాడుకదా!'

నామదేవుడి నోట ఈ పలుకులు వెలువడ్డమే తడవుగా పూర్వాభిముఖమయి ఉన్న దేవాలయం పశ్చిమాభిముఖం అయిపోయింది అని చెబుతారు. నేటికి ఆవంధ్యాలో ఉన్న నాగనాథదేవాలయం పశ్చిమాభిముఖంగానే ఉన్నది. కాని

నామదేవుడి జీవితంలో జరిగాయని చెప్పబడుతున్న ఈ చమత్కారాలన్నింటినీ అక్షరశః సత్యాలని నమ్మనక్కరలేదు. చమత్కారాలు ప్రధానం కాదు. ప్రతీకాత్మకంగా నామదేవుడి జీవితాన్ని అర్థం చేసుకోవడానికే ఇవి ఉపకరిస్తాయి

చిరవిరహం

తీర్థయాత్రలు పూర్తి చేసుకొని, జ్ఞానదృష్టితో నామదేవుడు
పండరిపురం చేరాడు.
పండరిపురంలో ప్రాణప్రియుడయిన విఠలుణ్ణి కలుసుకున్నాడు.
నా మనస్సులో అజ్ఞానం పేరుకొనిపోయిందని నన్ను దేశదేశాలు
తిప్పించావా? (అని అడిగాడు నామా)

కాని తీర్థయాత్ర కారణంగా నామదేవుడికి సాధుమండలితోనూ, ముఖ్యంగా జ్ఞానేశ్వరుడితో సన్నిహిత సంబంధ మేర్పడింది. 'అపూర్వమయిన సఖుడు జ్ఞానదేవుడు, నామదేవుడికి ప్రాణప్రియుడు' అని జనాబాయి వారి మైత్రిని వర్ణించింది. వారిద్దరి సావాసం కొద్ది రోజులపాటిదే. ఎందుకంటే తీర్థయాత్ర నుండి తిరిగి రాగానే జ్ఞానేశ్వరుడు సమాధి పొందుదామనుకున్నాడు. బాలయోగి, జ్ఞానుల్లో శ్రేష్ఠుడు, యోగులకు సఖుడు అయిన జ్ఞానేశ్వరుడు సమాధి పొందడం చూడడానికి భక్తులు - సాధువులు వేలసంఖ్యలో అక్కడికి వచ్చారు. ఈ ప్రసంగాన్ని వర్ణిస్తూ నామదేవుడు రచించిన 'సమాధి అభంగాల'కు మరాఠీ సాహిత్యంలో అజరామర స్థానం ఉంది. జ్ఞానేశ్వరుడు సమాధి పొందిన వివరాలను ఈ అభంగాలలో మనస్సుకు హత్తుకొని పోయేట్లు వర్ణించాడు. వాటిల్లో కరుణరసం వెల్లివారుతూ ఉంటుంది.

నామదేవుడు ఆ సందర్భంలో ఇలా అన్నాడు: 'దినకరుడు అస్తమించాడు, పితృదేవుడు జ్ఞానదేవుడు సమాధి పొందాడు.' ఈ సంఘటన నామదేవుడిలో ఊహాతీతమయిన మార్పు తెచ్చింది. 'చీమలపుట్టకు నిప్పంటుకున్నట్లుగా', అక్కడి వారి హృదయాలు క్షోభించాయి. 'నదిలోని చేపలకు ఏదో మత్తుమందు తినిపిస్తే కలిగే బాధ' అక్కడి వారందరికీ కలిగింది. 'గద్ద ఒక్కసారి వినువీథుల్లోకి ఎగిరిపోతే, దాని సంతానానికి కలిగే వ్యాకులత లాంటిది' వారంతా అనుభవించారు.

'నామా అంటున్నాడు ఇలా
జ్ఞానదేవుడి సృష్టి మరెప్పుడయినా దృష్టిపథంలోకి వస్తుందా?

సాధుపుంగవుడు, సఖుడు దూరమయిపోయినాడు
ఇహ పండరిపురంలో ఉండేదెలా?'

పండరిపురం వదలి దూరదేశాలకు వెళ్ళిపోదామనే భావం అతనిలో బలపడసాగింది.

'ఓ విఠలేశా! విను, ఇలా చేస్తాను
పండరిపురం వదలి వెళతాను.
వెళ్ళి దూరదేశాల్లో ఉంటాను
భక్తిపట్ల ఆసక్తిలేక మనస్సు ఉదాసీనమయిపోయింది.
ఓ కేశవా! నేను వెళతాను
నా వెంబడి పండరిని కూడా తీసుకొనిపోతాను
సాధునగరం, భీమానది ధూళిని తీసుకొనిపోతాను.
ఈ పండరిపురంలో ఫలానావాళ్ళు ఉండేవారని చెప్పుకుంటారు భావితరాలవారు.'

నామదేవుడు తన వృద్ధావస్థలో ఈ ప్రతిజ్ఞను నెరవేర్చాడు.

## జీవిత ఉత్తరార్థం : రెండో తీర్థయాత్ర

జ్ఞానేశ్వరుడు సమాధి పొందిన తరవాత నామదేవుడు 56 - 57 సంవత్సరాలు జీవించాడు. కాని ఈ జీవితం గురించిన వివరాలు వారి మరాఠీ అభంగాలలో కనిపించవు. జ్ఞానేశ్వరుడు సమాధి పొందడం నామదేవుడి జీవితంలో ఒక మార్పు తెచ్చింది. తీర్థయాత్రల సందర్భంలో ఉత్తర భారతంలోని అనేక ప్రదేశాలతో పాటు నేటి పంజాబును కూడా నామదేవుడు దర్శించాడు. ఇప్పుడు, రెండో సారి ఆయన ఒంటరిగా తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఆయన జీవితంలోని ఉత్తరార్థాన్ని, భక్తిమార్గ ప్రచారానికై నామదేవుడు ఎత్తిన పునర్జన్మగా పేర్కొనవచ్చు.

'భక్తిరసంపట్ల ప్రేమను ప్రసాదించు
నాకు మరో జన్మను ప్రసాదించు
ప్రేమభావం కుదురుకుంటే
ఎక్కడ ఉంటే అదే 'పంఢరి' అవుతుంది.'

నామదేవుడు పండరిపురం నుండి బయలుదేరాడు. ఉత్తర భారత దేశంలో పలుప్రాంతాలలో పర్యటిస్తూ, చివరకు భగవదాదేశానుసారంగా పంజాబు వెళ్ళాడనిపిస్తుంది. 'నేను నావెంట పండరిపురాన్ని తీసుకొని వెళతాను. నేను ఎక్కడ నివసిస్తే అదే పండరిపురమవుతుందన్న తన కోర్కెను నిజంచేసి చూపించాడు నామదేవుడు. పంజాబు ప్రాంతం చేరుకున్న తరవాత అక్కడ కూడా ఒక సాధుమండలిని ఏర్పరిచాడు. పంజాబీ భాషలో వ్రాయబడిన 'జనమ్ - సాఖీ' అనే పుస్తకంలో లభించే నామదేవుడి జీవిత ప్రధాన ఘట్టాలు, మరాఠీ ప్రాంతంలో ప్రచారంలో ఉన్న వాటికంటే అంత భిన్నమయినవి కావు. నామదేవుడి జననకాలం, మహాప్రస్థానకాలం - ఇవి రెండూ వేరు వేరుగా ఉటంకించబడినా, ఈ మధ్య జరిగిన పరిశోధనల వలన అభిప్రాయభేదానికి తావు లేదని నిరూపించబడింది.

నామదేవుడు దాదాపు 20 సం॥లు పంజాబులో ఉన్నాడు. పండరి నుండి బయలుదేరి భక్తిమార్గ ప్రచారం చేస్తూ మొట్టమొదట ద్వారక వెళ్ళాడు. అక్కడ నుండి మార్వాడు, మథురా, హరిద్వార్ చూచుకొని, పంజాబు చేరుకున్నాడు. పంజాబులో మొట్టమొదట అమృతసర్ జిల్లాలోని 'భూత్‌పిండ్' అనే గ్రామం వెళ్ళాడు. అక్కడ ఉండగా 'బహోర్‌దాస్' అనే ప్రథమశిష్యుడు లభించాడు. అక్కడనుంచి ఆయన నేటి గురుదాస్‌పూర్ జిల్లాలోని 'మరడ్' అనే గ్రామానికి తరవాత 'ఘట్టివాల్' అనే గ్రామానికి వెళ్ళాడు. ఘట్టివాల్‌లో ఆయన మకాంచేసిన చెరువును నేటికి 'నామియానా తాలాబ్' (నామదేవుడి చెరువు) అని పిలుస్తారు. లడ్డా, జిల్లా అనే ఇద్దరు శిష్యులు తమ అనుచరులతో పాటు సుషోవాల్, ధారీవాల్ అనే గ్రామాల్లో ఉండేవారు.

నామదేవుడు తన ధర్మసాధనకు అడవిలో ఒక ప్రశాంతస్థానాన్ని ఎన్నుకుని అక్కడ ఉండసాగాడు. కాని అక్కడికి కూడా ఆయన శిష్యులు రాసాగారు. ఆ ఆశ్రమ ప్రాంతంలో 'ధోమాన్' అనే గ్రామం ఏర్పడింది. అక్కడే ఆయనకు 'కేశవ్' అనే శిష్యుడు లభించాడు. అప్పటి డిల్లీసుల్తాను ఆలమ్ అనే అల్లాఉద్దీను దేవాలయ నిర్మాణానికై నామదేవుడికి ధనసహాయం చేసాడు. 'ధోమాన్'లో తరవాత 18 వ శతాబ్దంలో నామదేవుడి జ్ఞాపకార్థం ఒక చక్కటి దేవాలయం నిర్మించారు.

నామదేవుడి జీవితంలోని ఉత్తరార్థం గురించీ, ఆయన పంజాబులో గడిపిన కాలాన్ని గురించీ, మరాఠీ భాషలో ఏ ఆధారాలు లభించవు కాని

పంజాబీ భాషలో అటువంటి ఆధారాలు ఎన్నో కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. నామదేవుడి శిష్యులయిన విష్ణుస్వామి, బహోర్‌దాసు, లద్ధా, జిల్లా, కేశో (కవ్) కలాధారీల రచనలు పంజాబీ భాషలో సుప్రసిద్ధాలు. భక్తిమార్గ ప్రచారకులుగా తరవాతి కాలంలో వాసికెక్కిన రామానంద్, కబీర్, గురునానక్, రైదాసు, పీపా మొదలయిన వారందరూ తమ రచనల్లో నామదేవుణ్ణి సగౌరవంగా ఉటంకించారు.

## 'ఆదిగ్రంథం'లో నామదేవుడు

సిక్కులకు మతగ్రంథమయిన 'ఆదిగ్రంథం' (గురుగ్రంథ సాహెబ్) లో ఉన్న నామదేవుడి 61 కీర్తనలు అతని కృతిత్వానికి పరమ ప్రమాణాలు. నామదేవుడి తరవాత రెండువందల సంవత్సరాలకు గురునానకు జన్మించాడు. ఆయన స్థాపించిన సిక్కు సంప్రదాయానికి గల రెండు ముఖ్యమయిన ఆధ్యాత్మిక తత్త్వాలు 'జపుజీ'కి మూలమంత్రాలు.

'ఒకటి ఓంకారం, సత్యనామం.
కర్త పురుషుడు (పరమాత్ముడు)
నిర్భయ, నిర్వైర అకాలమూర్తి
ఇవి నాకు గురుప్రసాదాలు.'

ఈ మూలమంత్రం నామదేవుని ఉపదేశానికి దాదాపు అనువాదమే అని చెప్పవచ్చు. గురునానక్ ఉపదేశాలకూ, ఆదిగ్రంథంలో భగవన్నామానికి, దాని స్మరణకు గల ప్రాధాన్యానికి ఆధారం ముఖ్యంగా నామదేవుడి ప్రేరణయే అని ఊహించవచ్చు.

జ్ఞానదేవుడికి సమకాలీనుడయిన మరాఠీ అభంగ రచయిత నామదేవుడూ, ఆదిగ్రంథంలోని కీర్తనల రచయిత అయిన నామదేవుడూ వేరువేరు వ్యక్తులని కొందరి అభిప్రాయం. ఎందుకంటే ఇద్దరి ఆరాధ్యదేవుళ్ళు వేరు వేరు.

ఇద్దరి భాషలు వేర్వేరు. ఇద్దరి జీవిత చరిత్రలు వేరు. కాని ఈ అభిప్రాయం నిరాధారమని తేలిపోయింది. మరాఠీ అభంగాలలో, ఆదిగ్రంథంలోని

---

ఇక్ఓంకార్, సత్‌నామ్, కర్తాపురఖ్
నిర్భఉ, నిర్వైర్, అకాల్ మురత్
అజూని - సైభంగ్, గురుప్రశాద్.

కీర్తనలలో భగవంతుడికి గల ఎన్నో పేర్లు ఉటంకించబడ్డాయి. రాముడు, నారాయణుడు, శివుడు- ఈ పేర్లతోపాటు, విఠలుడి పేరు కూడా రెండు భాషల రచనల్లో కనబడుతుంది. మరాఠీలో,

"ఎటు చూచినా అటు విఠోబాయే
లోపలా-బయటా, సర్వత్రా, నిరంతరం విఠోబాయే" అన్నారు.
ఆదిగ్రంథంలో,
'ఇటూ విఠలుడే, ఆటూ విఠలుడే
విఠలుడు లేకుండా ప్రపంచమే లేదు.
ఎటు చూచినా విఠలుడే
సర్వత్రా విఠలుడే'
అని అంటాడు.

ఇవి రెండూ వేర్వేరు భాషల్లో చెప్పిన ఒకే భావమని అనిపిస్తున్నది. నామదేవుడి అభంగాల భాషవేరు, ఆదిగ్రంథంలోని నామదేవుడి రచనల భాష వేరు అనే వాదంలోకూడా బలంలేదు. ఆయన రచించిన ఎన్నో ఉపదేశాత్మక అభంగాలకు, ఆది గ్రంథంలోని కీర్తనలు అనువాదాలుగా కనిపిస్తవి. ఉదాహరణకు

'గాలిపటం దూర గగన తలంలో విహరిస్తున్నది.
కాని మనస్సంతా చేతిలోని దారంపైనే.
కుండ మీద కుండ పేర్చుకొని గూర్జర స్త్రీ నడుస్తున్నది.
రెండు చేతుల్లో ఏమీ లేదు కాని మనస్సంతా వాటిపైనే'
అనే అభంగాన్ని ఈ క్రింది కీర్తనతో పోల్చి చూడండి.
'నీలి రంగు కాగితం గాలిపటం
ఆకాశ మధ్యంలో విహరిస్తున్నది,
కుండలలో నీరు నింపుకొని
రాజకుమార్తె వెళుతున్నది,
నవ్వుతున్నది, ఒయ్యారాలు ఒలక బోస్తున్నది
కాని మనస్సంతా కుండలమీదనే.'

ఆదిగ్రంథంలోని నామదేవుడి పదాలు నేటి పంజాబీ భాషలో రచింపబడలేదన్న విషయం గుర్తుంచుకోవాలి. ఆదిగ్రంథంలో కూర్చబడ్డ అన్ని కీర్త

నల భాష 'సధుక్కడీ' (సాధువులభాష), అది సార్వదేశికమయిన భాష. అయితే ఆయాకృతుల్లో ఆయారచయితల మాతృభాషల ప్రభావం కనబడుతుంది. వంగ దేశానికి చెందిన జయదేవుడు కానివ్వండి, ఉత్తరప్రదేశానికి చెందిన కబీరు కానివ్వండి, లేక మహారాష్ట్రానికి చెందిన నామదేవుడు కానివ్వండి, అందరూ ఈ సర్వసామాన్య భాష అయిన 'సధుక్కడీ' లోనే రచనలు చేసారు. ఈ భాషలో హిందీ కూడా కనబడుతుంది. అది ఆనాటి ఆధ్యాత్మిక–సాంస్కృతిక భావాలను జోడించిన భాష. నామదేవుడి ఈ కీర్తనలలో మరాఠీతోపాటు పంజాబీ భాష కూడా చక్కగా కలిసిపోయి కనబడుతుంది. మరాఠీ కీర్తనలలో ఉన్న గేయ సౌష్ఠవమే, ఆదిగ్రంథంలోని కీర్తనలలోనూ కనబడుతుంది. అంతేకాక అవి వేర్వేరు రాగాల్లో వ్రాయబడ్డాయి.

నామదేవుడు గురు విఠోబాఖేచర్ దర్శనం చేసుకోవడం గురించి పైన చెప్పాం కదా. ఆదిగ్రంథంలో కూడా ఒక కీర్తనలో నామదేవుడు ఖేచర్‌ని గురించి చెప్పేటప్పుడు 'గురుప్రసాద' మంటాడు.

'ఖేచర్ భూచర్ తులసీమాలా, గురుపరసాదీ పాఉఆ.'

విఠోభాఖేచరుడు భగవంతుడి తలమీద కాళ్ళు పెట్టుకొని పడుకున్న కథ లాంటిదే, గురునానక్‌ను గురించి కూడా ప్రచారంలో ఉంది. మక్కా వెళ్ళినపుడు గురునానక్ అక్కడి ముల్లాలకు భగవంతుడి సర్వవ్యాపకత్వాన్ని గురించి ఇలాగే బోధిస్తాడు. ఈ కథ పంజాబులో బాగా ప్రచారంలో ఉంది.

## సమాధి

నామదేవుడు పంజాబువెళ్ళి అక్కడి నివసించడాన్ని గురించి మరాఠీ సాధువులు ఎక్కడా ఉటంకించలేదు. దానికి ఎన్నో కారణాలున్నాయి. ఆనాటి మహారాష్ట్ర సాధువులకు నామదేవుడి పంజాబు యాత్రను గురించి ఎక్కువగా తెలిసిఉండదు. నామదేవుడు ఉత్తర దేశంలోనే భక్తిమార్గ ప్రచారం, నామ మాహాత్మ్యప్రచారం చేసాడు. కాని అక్కడ కూడా ఆయన ఏ ఒక్కచోట, చాలా రోజులు ఉండి ఉండడు. అదీగాక ఆయన అంతరంగం మాత్రం పండరిపురం నలు వైపులా విహరిస్తూ ఉండి ఉండాలి.

ఆయన మనసు విఠలుఁడి దర్శనోత్కంఠతో నిరంతరం తపిస్తూ ఉండాలి.

'దర్శనాభిలాషతో తహతహలాడింది చిత్తం,
ఒక్కచోటా స్థిరంగా ఉండలేక పోయింది.
కనిపించిన వాడినల్లా ఇదేప్రశ్న
పండరినాథుడు నన్నెందుకు పిలిపించుకోడు?
వారకారి సఖులు పండరి వెళుతూ ఉంటారు.
వారితో ఒక సందేశం పంపిస్తాను
నామదేవుడు ఇహ అలిసిపోయాడు
(ఇంకా) కంఠంలో ప్రాణాలున్నాయి కనుక
రాత్రింబవళ్ళు నామస్మరణ చేస్తూ ఉన్నాడు'

నామదేవుడు చివరిరోజుల్లో పండరిపురం వెళ్ళాలని కోర్కె వెల్లడించే టప్పటికి, ఆయన విరహభావనను గుర్తించి ఆయన శిష్యులంతా అతిగా వ్యాకుల పడ్డారు. చిట్టచివరకు నామదేవుడు పండరిపురం వెళ్ళాడు. అక్కడే క్రి. శ. 1350 లో సమాధి పొందాడు. పండరిపురం దేవాలయం ఎదుటే తన ప్రాణాలు వదిలాడంటారు.

పర్భణి జిల్లాలో నరసీలో క్యాథూ లేక క్యాడ్ అనే నదీ తీరాన నామదేవుడి పేరిట ఒక సమాధి ఉంది కాని అది సంత్ నామదేవుడిది కాదు. ఘోమాన్‌లో కూడా ఒక నామదేవుడి సమాధి ఉన్నట్లు చెప్పబడుతున్నది. అక్కడ రాతి అకు మీద చెక్కిన నామదేవుడి పటం కూడా ఉన్నది. అక్కడి గుడిలోపలి గదిలో, దుప్పటి కప్పుకొని, మూడు రోజుల పర్యంతం ఆయన పడుకొని ఉండిపోయాడట, ఆ మూడు రోజులపాటు లోపలి కెవ్వరూ రాకూడదని ఆదేశించాడట. ఆ తరవాత శిష్యులు లోపలికివెళ్ళి చూస్తే, ఆయన మృతి చెంది ఉన్నాడట. ఈ విధంగా ఆయన తన స్థూల కాయాన్ని ఘోమాన్‌లో వదలిపెట్టి, సూక్ష్మశరీరంతో పండరి పురం వెళ్ళాడని కూడా ఒక కథ 'జనసాఖీ' లో ఉంది. కాని మొత్తం మీద ఆయన దేహ పరిత్యాగం చేసింది పండరి పురంలోనేననీ, ఆయన వస్త్రసమాధి ఘోమాన్‌లోననీ పరిశోధకులు చెప్పే విషయం యుక్తియుక్తమనిపిస్తుంది.

# రచనలు - వేదాంతం

'జ్ఞానదేవుడు వేసాడు పునాది,
కట్టాడు దేవాలయం నామదేవుడు
కింకరుడు నామదేవుడు
విస్తరింప చేసాడు నలువైపులా.'
(సంత్‌బహిణాబాయి.)

ఎంతో మంది సాధుపుంగవుల అనుగ్రహంవల్ల మహారాష్ట్ర ప్రాంతంలో వారకారి సంప్రదాయానికి అనగా భాగవత ధర్మానికి పునాది పడ్డది. భాగవత ధర్మానికి పునాది వేసినవాడు జ్ఞానదేవుడే. ధర్మమందిర స్థాపన చేసి ఆ దేవాలయానికి కింకరుడయి ధర్మమందిర విస్తరణ కృషిచేసిన గొప్పదనం నామదేవుడిదే. కింకరుడనగా నిరంతరం 'కింకరోమి? (ఏమి చేసేది?)' అని అడిగే కార్యతత్పరుడయిన వ్యక్తి. నామదేవుడు భాగవతధర్మ రూపమయిన దేవాలయంలో చాలా కాలం సతత సేవచేసిన వాడు కనుకనే అతను భాగవత ధర్మాన్ని అంతగా వ్యాపింప చేయగలిగాడు.

ఏదయినా ఒక సంస్థను స్థాపించేటప్పుడు పునాది రాళ్ళు వేసే వాళ్ళు చాలామంది ఉంటారు. కాని తరవాత. ఆ సంస్థకు భవ్యమయిన-దివ్యమయిన ఆకారం ఏర్పడ్డ తరవాత మూల సంస్థాపకు డెవ్వరు అన్న విషయం వివాదాస్పదమయి పోతుంది. మహారాష్ట్రప్రాంతంలో భాగవత ధర్మాన్ని లేదా వారకారి సంప్రదాయాన్ని స్థాపించిన వాడెవ్వరు అన్న విషయం కొద్దిగా వివాదాస్పదమయినది. నిజానికి ఈ ధర్మమందిరానికి కలశ స్వరూపుడయిన సంత్ తుకారాం శిష్యురాలయిన బహిణాబాయి ఈ గొప్పదనాన్ని నామదేవుడికి. చక్కటి రూపకం ద్వారా కట్టబెట్టింది. ఆవిడ మాటలనే ప్రామాణికంగా ఎంచుకోవాలి. ఆ మాటలలో మార్పు చేయడానికి సరిక్రొత్త ఆధారం ఏదీ లభించలేదు.

## వేదాంత పరమయిన ఆధారం

జ్ఞానేశ్వరుడు భాగవతధర్మానికి పునాది వేశాడనడానికి అర్థం ఆయన ఆ సంప్రదాయానికి గల మూలతత్త్వాలను "జ్ఞానేశ్వరి"లో సమగ్రంగా వివరించాడు అని మాత్రమే. నిజానికి భాగవత ధర్మానికి మూలం 'జ్ఞానేశ్వరి' కంటేఎంతో ముందే భారతీయ వేదాంతంలో గోచరిస్తుంది. ఆ విషయాన్ని జ్ఞానదేవుడే ఒక 'ఓవీ' లో ఇలా స్పష్టంగా చెప్పాడు.

'ప్రాణిజాలాన్నంతా భగవంతునిగా ఎంచుకోవాలి.
ఇదే నా భక్తి యోగ సారమని నిశ్చయంగా తెలియండి."

అంటే ప్రతి ప్రాణిలోనూ భగవదంశను చూడగలగడమే భాగవత ధర్మ సారం.

నామదేవుడు ప్రవచించిన వేదాంత పరమయిన వాక్కులను పరిశీలిస్తే, ఆయన అర్థం చేసుకున్న భాగవత ధర్మాన్ని వివరించవచ్చు.

సమస్త జగత్తుకుమూలం ఒకే ఒక బ్రహ్మపదార్థం. అది ఒకటి, అఖండం.

'సమర్థమయిన వేదవాక్యం
భేదాభేద రహితం బ్రహ్మతత్త్వం,'

అందరిలో వ్యాపించి ఉన్న బ్రహ్మయే సత్యం. పైపైన కనిపించేదంతా మిథ్య. ఇదంతా వేదాలలో చెప్పిన మూలతత్త్వం. వేదాలకు కూడా ఆ మూల తత్త్వం సరిగా బోధపడలేదట.

'వేదాలు ఆ మూల తత్త్వాన్ని వర్ణిస్తూ వేసారి పోయాయి.
ఆ బ్రహ్మతత్త్వం అనిర్వచనీయం కదా!
అనిర్వాచ్య తత్త్వాన్ని వర్ణించబోయి, ఆదిశేషుడే భ్రమలో పడిపోయాడు.
ఆదిశేషుడి జిహ్వయే కుంటుపడిపోయింది.
ఆ తత్త్వం అనంతమని నామదేవుడు అంటున్నాడు!

మరి ఆ తత్త్వాన్ని ఆకళింపు చేసుకునేందుకు ఉపాయం ఏమిటి ?

'జ్ఞాన సత్యముక్తుడు, శుద్ధబుద్ధియుక్తుడు
కారణ రహితుడు, నిరంజనుడు
అట్టివాణ్ణి మేము చర్మచక్షువులతో చూసాం.
పండరిపురంలో ఇసుకలో నిలబడ్డాడు.
వేదాలకు, ఆదిశేషుడికి గోచరం కానివాడు.
పుండరీకుని ప్రేమకు కట్టుబడ్డాడు.
వేదాలు 'నేతినేతి' అని వదలివేశాయి.
మేము వాణ్ణి పాటల్లో ఆకట్టుకున్నాం.
అతని స్వరూప నిర్ధారణ పురాణాలు చేయసాగాయి.
పది–పవి అనే వాదంలోపడి కొట్టుమిట్టాడాయి.
కాని విఠోబా చరణాలు ఆర్తితో పటుకుంటే
అన్నీ సులభసాధ్యాలవుతాయి.'

కేశవ చరణప్రాప్తిపట ఆర్తికలిగి ఉండడమే ప్రధానమని నామదేవుడి విశ్వాసం.

అంటీ ముట్టకుండా ఉండాలి.

'బ్రహ్మసత్యం. ప్రపంచ మిథ్యారూపం. మిథ్యామాయాజాలం. మృగమరీచిక. ఈ ప్రపంచ మాయావక్రం'. ఈ ప్రపంచ మిథ్య అనీ, క్షణభంగురమనీ నామదేవుడు ఇలా నిరూపించాడు.

'నీటిలో కనబడ్డ బుడగ మరుక్షణం లేదు
కంటికి కనబడుతున్న ఈ ప్రపంచం కూడా మిథ్య
గారడివాని మాయాజాలం ఇది
ఇక్కడ సత్యం అంటూ ఏమీ లేదనీ,
అంతా క్షణికమేననీ
నామా అంటున్నాడు.'

ప్రపంచం క్షణభంగురం. అలాగే పగిలిన కుండలా పనికిరానిది కూడా.

'పగిలిన కుండ దేనికి పనికి వస్తుంది?
ఈ ప్రపంచం కూడా అంతే అని తెలియండి.
కలలో కనిపించిన విషయాన్ని
మెలకువ వచ్చినప్పుడు వివరించినట్లు
ఈ భవరోగం ప్రారబ్ధఫలితమే.
ఇదంతా బూటకమని నమ్మండి
అని నామా అంటున్నాడు.'



అలా అయితే ఈ ప్రపంచంలో మానవుడు చేయవలసిన కర్తవ్యం ఏమిటి? 84 లక్షల జన్మలలో ఒక్కసారి మాత్రమే లభించే ఈ మానవ జన్మలో కూడా ఆత్మతత్త్వాన్ని గుర్తెరక్కపోతే, జీవుడు మళ్ళీ మాయాజాలంలో ఇరుక్కోగలడు.

'చివరి అవకాశం మానవజన్మ.
చేయిజారి పోయిందో మళ్ళీ చిక్కుల్లో పడిపోతావు.
అది గుర్తించి ఆత్మారాముణ్ణి సాక్షాత్కరింప చేసుకో.
సుగమమే ప్రపంచం కాని అంటే ముట్టకుండా ఉండు.
తరచుగా కీర్తిస్తూ ఉండు పై వాణ్ణి.
భక్తుడి ద్వారందగ్గర కాపుంటాడు విఠలుడు

చేత సుదర్శనచక్రం ధరించి
అని అంటాడు నామదేవుడు.'

ప్రపంచంలో ఉండి అనుభవించడమంటే ఇచ్చవచ్చినట్లూ, ఆసక్తితోనూ కాదు. ప్రపంచంలో ఉండాలి కాని పూర్తిగా అనాసక్తభావంతో, ఎల్లప్పుడు నామ స్మరణచేస్తూ ఉండాలి. ఎందుకంటే భక్తసంరక్షణార్థం సుదర్శనచక్రం చేత ధరించి విఠలుడు తత్పరుడయి ఉంటాడు.

'ఈ మిథ్యా ప్రపంచాన్ని సృష్టించావు
నిన్ను పూర్తిగా ప్రపంచనలో ముంచెత్తారు
అలాగే నన్ను సేవకునిగా నియమించుకొని
స్వామిద్రోహం ఎలా చేయించావు?
మేరువు మెడలో మశకాన్ని కట్టిపెట్టి
తమాషా చూస్తున్నావా అనాథనాథా!
దేవా! నీ మాయను గ్రహించాను
ఇహ నా మార్గం నేను చూచుకుంటాను
(అని) అంటాడు నామదేవుడు.'

మిథ్యా ప్రపంచంలో చిక్కుకుంటే, మానవుడు భగవంతుని పట్ల అపచారం చేస్తాడు. మరి పరమాత్ముడి మాయను జయించడానికి నామదేవుడు ప్రపంచించిన ఉపాయం ఏది?

## భాగవత ధర్మం.

ప్రపంచం మిథ్య అనీ, దుఃఖపూర్ణమనీ తెలుసుకొనడమే మన జీవితాలకు పరమావధి. అదే భాగవత ధర్మ రహస్యం.

'తెలిసింది మర్మం – ఆచరిద్దాం భాగవత ధర్మం
ఈ అవతారం లభించింది
మాటా - నడకా లేకుండా పోయింది.
ఆయనకు కావాలి భక్తి భావం
వదలి వచ్చారు వైకుంఠం
సత్సాంగత్యం సాధిద్దాం

హృదయ కుహరంలో బంధిద్దాం.
వాని పాదాలు నా శిరస్సుననే ఉన్నాయి
(అని) నామదేవుడంటున్నాడు.'

భగవంతుడికి మమకార - మమత్వాలు కావాలి. అందుకనే భక్తుల కోసం వైకుంఠం వదలి వచ్చాడు. సత్సాంగత్యంతో ఆ విఠలుణ్ణి పొందాలి, అతణ్ణి అంతఃకరణంలో అంతర్లీనం చేసుకోవాలి. అదే భాగవత ధర్మరహస్యం.

నామదేవుడు పేర్కొన్న భాగవత ధర్మమే మహారాష్ట్ర ప్రాంతంలో వాసి కెక్కిన వారకరీ సంప్రదాయం. వారకరీ అంటే ఆషాఢ-కార్తీక శుద్ధ ఏకాదశి నాడూ, ఇతర పర్వ దినాల్లోనూ, నియమప్రకారంగా 'వారీ' (పర్యాయం, వంతుల) వారీగా పండరిపుర దర్శనం చేసుకునే భక్తుడు. 'పండరిపుర యాత్ర చేయడం అనే కులాచారం కలవారి పాదధూళిని నా శిరస్సున ధరిస్తాను.' 'పండరిపుర యాత్రా నియమాన్ని వీడని సంసారులు ధన్యులు ఈ లోకంలో' అని అంటూ నామదేవుడు యాత్రానియమం (వారీ) కలవారి పట్ల గౌరవ భావం ప్రకటించాడు. 'వారీకర్' లను 'పండరి వీరుల'ని భక్తిభావ పూర్వకంగా వర్ణించాడు.

'మహా సుఖ సృష్టి జగత్తును ముంచెత్తింది.
పాపతాపాలకు అది వికృతి
జగద్రక్షకుణ్ణి దర్శించుకోపోయే వైష్ణవులను చూచి
దేవతలు దివిలో పతాకాలు ఎగురవేస్తున్నారు.
హరినామ ప్రచారకులు వచ్చారు
వీర వారీకరులు వచ్చారు పండరికి
వారి చరణధూళితో ఆకాశం నిండిపోయింది.
బ్రహ్మాది దేవతలంతా గుమిగూడారు
ఆ ధూళి మా శిరస్సుకు తాకాలి అని తహ తహలాడారు.
భక్తిప్రేమ భావాలతో నిమగ్నులయిన వారు
సిగ్గువదలి, హరిలో లీనమయి నృత్యం చేస్తున్నారు
ఆనంద సాగరంలో ఓలలాడుతున్నారు,
హృదయంలో కృష్ణమూర్తిని దర్శించుకొని

అణువణువులో హరిరూపాన్ని దర్శిస్తున్నారు
నయన కమలాలు ప్రపాత పూరితాలు
సాత్త్విక భావంతో పులకిత గాత్రులు వారు.
విఠల నామ సంకీర్తనతో వాతావరణం ప్రతి ధ్వనిస్తున్నది.
నెమలి ఈకెల కిరీటం
ఆ శిరస్సుకే ఒక అలంకారం
కేశవనామానికి ఈ శరీరం ఒక గద్దియ
హరిదాసుడు పాంవుకోళ్ళు పరిచాడు.'

తన శరీరాన్నే పరుపుగా, భక్తుల కాళ్ళ క్రింద పరుపుగా ఊహించుకొని, వారీకరుల పట్ల తన అభిమానాన్ని అభివ్యక్తం చేసాడు నామదేవుడు. సాధువుల-వైష్ణవుల మహిమలను వర్ణించేటప్పుడు నామదేవుడి ప్రతిభ వెల్లివిరుస్తుంది. 'సాధువుల మహిమ ఎరిగినవారెవరు? వర్ణించి-వర్ణించి బ్రహ్మకూడా వేసారి పోయాడు.' ఇంకోచోట వైష్ణవుల సమూహం వస్తుంటే చూసి, కలికాలం కూడా తోకముడిచి పారిపోయింది.' ఇలా వారీల మహిమను వర్ణించాడు నామదేవుడు.

వారీకర్ అంటే వైష్ణవులని అర్థం. వైష్ణవులుగా కావడానికి మార్గాన్ని ఇలా వివరించాడు నామదేవుడు.

'వేదాలు అధ్యయనంచేస్తే వైదికులు అవుతారుకాని వైష్ణవులుకాలేరు.
పురాణాలు ప్రవచిస్తే పౌరాణికులు కాగలుగుతారు కాని వైష్ణవులు కాలేరు
పాటలుపాడితే గాయకులవుతారు కాని వైష్ణవులు కాలేరు.
కర్మలను ఆచరిస్తే నైష్ఠికులవుతారు కాని వైష్ణవులు కాలేరు.
యజ్ఞాలుచేస్తే సోమయాజులవుతారు కాని వైష్ణవులు కాలేరు.
తీర్థాటనలుచేస్తే కావళ్ళు మోసేవాళ్ళవుతారు కాని వైష్ణవులు కాలేరు.
భగవన్నామాన్ని స్మరిస్తేనే వైష్ణవులు కాగలుగుతారు.

అంటే నామస్మరణయే వైష్ణవులకు స్థాయీభావం.

'వైష్ణవుని ఇంట ఆతిథ్యం
నామమనే ఆహారం
కడుపునిండా ఆరగించు

ఆనందంగా కలిసిమెలిసి రామనామం జపించండి
దుష్టులతో స్నేహంవద్దు
వారిని కొద్దిదూరంలో ఉంచు
ఏకాంతంలో హరినిసేవించు
(అని) అంటాడు నామదేవుడు.'

వైష్ణవుల సాంగత్యంలో, దుష్టులకు దూరంగా ఉండి, ఏకాంతంలో నామస్మరణ చేయాలి.

'సాధువుల సాంగత్య సుఖాన్నిగురించి వర్ణించబోకు.
ఇంకా ఎక్కువ తెలివి తేటలు చూపించబోకు.
ప్రేమకు దిష్టి తగలకలదు
సత్సాంగత్యంలో మనస్సు తనంతతానే
నివృత్తి పొందగలదు
(అని) అంటాడు నామా!

ఇలాంటి అభిప్రాయాలనే నామదేవుడు ఎన్నో చోట్ల అభివ్యక్తీకరించాడు.

## నామ మాహాత్మ్యం

నామదేవుడు ప్రపంచించిన సిద్ధాంతాలలో ప్రధానమయినది నామ స్మరణ. నామదేవుడు ఉగ్గడించినంతగా, నామ మాహాత్మ్యాన్ని గురించి మరే భక్తుడు వర్ణించి ఉండతేదేమో! నామదేవుడు దాదాపు 200 అభంగాలలో నామ మాహాత్మ్యాన్ని సాంగోపాంగంగా వర్ణించాడు.

'నామమాహాత్మ్యాన్ని బ్రహ్మకూడా వర్ణించలేదు
అందుచేత కర్మానుసరణం చేయి
నామమే కర్మ, నామమే ధర్మం.
కేశవుడే ఈ రహస్యాన్ని తెలిపాడు
నామమే శుద్ధోదక స్నానం, నామమే పవిత్ర సంధ్యావందనం.
నామం లేందే వేదం లేదు
నామమేగతి, నామమే ముక్తి.
నామదేవుడి చిత్తంలో రామనామమే ఉంది.

నామమాహాత్మ్యాన్ని సుస్పష్టంగా వివరిస్తూ, నామమే పరమేశ్వరుడి స్వరూపమని ప్రతిపాదించాడు.

'నామమే రూపం, రూపమే నామం
నామరూపాలు వేరువేరు కావురా
బ్రహ్మకు ఆకారం ఇవ్వగానే నామరూపాలు పుడతాయి
అందుచేత అతణ్ణి నామవేదంలో స్థిరంచేసారు
నామజపంలాంటి యజ్ఞంలేదు
మూర్ఖులు అజ్ఞానులు అంటారు
నామదేవుడు నిరతం కేశవనామస్మరణ చేస్తాడట
ప్రేమమూర్తులయిన భక్తులుకూడా ఇదే అంటారు.'

రామనామస్మరణ చేసినంతమాత్రం చేతనే ప్రారబ్ధం నశిస్తుందంటూ నామదేవుడు ఇలా అన్నాడు.

'నామస్మరణ చేయగానే పాపాలు తల్లడిల్లిపోయాయి
నామస్మరణ చేయగానే చిత్రగుప్తుడు కలం వదలేసాడు
పూజాద్రవ్యాలతో బ్రహ్మదేవుడు దిగివచ్చాడు
ఇది అబద్ధమయితే నాతల ముక్కలుచేయండి
(అని) నామా అంటున్నాడు.'

రామనామ రహితాలయిన సంగీతం-విద్య మొదలయినవి పనికిరానివంటూ నామదేవుడు ఎన్నో దృష్టాంతాలు చెప్పాడు.

'సత్సాంగత్యం లేనిగ్రామం వ్యర్థం, ఆశ్రమం వ్యర్థం,
అనుక్షణం భజనచేయని సమాజం వ్యర్థం, సంతానం వ్యర్థం,
వాక్కులో సర్వేశ్వరుడులేని తలపులు వ్యర్థం, ఆచారాలు వ్యర్థం,
పాండురంగని కథలుచెప్పని వ్యక్తి వ్యర్థుడు, విననిశ్రోత వ్యర్థుడు,
రామనామగానంలేని సంగీతం వ్యర్థం, చదువు వ్యర్థం,
నారాయణ రహితమయిన జీవనం వ్యర్థం,
(అని) నామదేవుడంటున్నాడు.'

నామమాహాత్మ్యాన్ని కించపరచి, ఎగతాళిచేసే వారు తుచ్ఛులంటూ నామదేవుడు ఇలా అంటాడు.

'చక్కటి పాటలు పాడే వాళ్ళను మూర్ఖులు ఎక్కిరిస్తారు
నామం మధురం, నామం మధురం, అదే జీవన సార్థక్యం
నవ్వేవాళ్ళను నవ్వనీ, మనం పాడుతూనే ఉందాం
ఎగతాళి చేసే వాళ్ళ వంశం నరకం పాలవుతుంది
(అని) నామా అంటున్నాడు.'

నామస్మరణకు ప్రతిక్షణం తగిందే. దుఃఖపూర్ణమయిన ప్రపంచం నామస్మరణ చేత దుఃఖరహితమయి పోతుంది.

'ఇతర సాధనాలతో పని యేమి?
నామమంత్రం ఉండగా
ఇది మంత్రాలకు మూల మంత్రం
ఇదే శివుడు జపించే రామనామం
భవబంధాలు నశిస్తాయి, ముక్తిమార్గం సులభమవుకుంది
దుష్టభావాలు వదలి మనస్సును నామస్మరణపై లగ్నం చేయి
పరిస్మరణ చేస్తే ప్రాపంచిక చింతలు తొలగిపోతాయి.

నామమే ఆత్మజ్ఞానానికి మూలసాధనం. అది ద్వైతాద్వైతాలకు అతీతమయినది. అది స్వయంగా పరబ్రహ్మస్వరూపం.



'విజ్ఞానం, ధ్యానం, జపం, తపం
అన్నింటికి సాధనం నామం
నామం పై ప్రత్యయం కలగదెవ్వరికి?

ముందుగా గురు శరణు పొందు.
నేనే నామమని గుర్తించు.
ఆమూలాన్ని గ్రహించు
ద్వైతాద్వైతంలోనిదాన్ని గుర్తించు
అనామం ద్వైతాద్వైతాతీతం
అనామం త్రిభువన వ్యాపకం
అనామమే పరబ్రహ్మం
(అని) నామదేవుడు అంటున్నాడు.'

నామదేవుడికి "నామం" అత్యంత ప్రియమయినది. నామస్మరణచేసే అదృష్టవంతులయిన సాధుపుంగవులకు దాస్యం చేస్తానంటాడు.

'అంతా, జగమంతా భగవంతుడిదే
విఠలనామస్మరణచేయి
పాండురంగనిపట్ల పరిపూర్ణప్రేమ కలగాలి
వంశమంతా పుణ్యవంతం
వారందరూ ధన్యజీవులు
అనుక్షణం విఠలనామస్మరణలో, మునిగితేలేవారికి
కింకరుడై నామదేవుడు సేవచేస్తాడు.'

భాగవత ధర్మానికి మూలాధారం నామమే అని అనిపించేటంతగా నామదేవుడు నామమాహాత్మ్యన్ని వర్ణించాడు. నామస్మరణచేసే పుణ్యాత్ములకు కింకరభావంతో సేవచేస్తానన్న విషయాన్ని మనస్సులో పెట్టుకునే బహిణాబాయి భాగవత ధర్మదేవాలయానికి నామదేవుడు 'కింకరుడు' అని అన్నది.

'వేద-శాస్త్రాధ్యయనం చేయవద్దు
నామదేవుడి 'ప్రబంధం' చదువు
బ్రహ్మజ్ఞానం వద్దు వైరాగ్యం వద్దు
సత్సాంగత్యంతో భక్తిభావాన్ని సాధించు
ఈ కలియుగంలో నిష్ఠతో కర్తవ్యం ఆచరించి
ఎవరు మోక్షం పొందారో చెప్పు.
నామస్మరణను మించినది లేదని
నాకు సాధుభక్తులు చెప్పారు
(అని) నామా అంటున్నాడు.'

ఈ విధంగా సాధువుల ప్రేరణవల్ల నామదేవుడు అనాహత నామస్మరణను ఉపదేశించాడు.

## ఉపదేశాలు

మనస్సు స్వాభావికంగానే చంచలమయినది. చపలమయినది, సంకల్ప-వికల్పాత్మకమయినది, లంపట స్వభావం కలది. పరధన-పరస్త్రీ వ్యామోహం

కలది. కనుక అట్టి మనస్సుకు సత్ప్రవృత్తి కలిగించడానికి, నామదేవుడు మనస్సును సంబోధిస్తూ ఎన్నో ఉపదేశాలు చేసాడు.

'ఒక్క క్షణం ఏకాంతంగా
ఆలోచించవే మనసా! శాంతి ఎక్కడ ఉందా? అని
84 లక్షల పర్యాయాలు పుట్టీ - గిట్టీ
విసిగి వేసారి పోయావు కదా మూర్ఖుడా!
మానవ జన్మ అతి దుర్లభం
వ్యర్థంగా గడిచి పోతున్నది కదా!
మట్టి బెడ్డను చూచుకొని, పరుసవేదిని వదలుకున్నావు
నా హృదయం దుఃఖంతో వికావికలవుతున్నది
విషయ సాంగత్యం వదలివేయి
(అని) నామా నిన్నభ్యర్థిస్తున్నాడు.'

విషయవాసనలను త్యజించాలంటే, సత్సాంగత్యమే ఏకైకసాధనం. ఎటు వంచితే అటు వంగేది మనస్సు.

మనస్సా! మట్టిని (అశాశ్వత భౌతికసుఖాలను) గురించి ఆలోచించావో, మట్టివే అయిపోతావు. కేశవుడివి కాలేవు'. కనుక పృథ్వి, వాయువు, ఆకాశాలను గురించి కాకుండా 'కేశవుణ్ణి' గురించి గనుక ధ్యానించావో, కేశవుడివే కాగలవు.' అని ఆయన మనస్సును ప్రబోధించాడు.

మనస్సుకువలెనే ఆయన కుటుంబీకులకు, ముముక్షువులకు, దుష్టులకు కూడా ఉపదేశం చేసాడు. ఆయన ఉపదేశాలలోని ముఖ్యవిషయాలు చిత్తశుద్ధి, సత్సాంగత్యం, భగవద్భక్తి మొదలయినవి. ఆయన ఉపదేశాల మర్మం లేక సారం అన్నిరకాల సత్ప్రవృత్తులపట్ల సద్భావం, ప్రేమకలిగి ఉండాలన్నదే. ప్రేమ తనంతటతాను పుట్టుకువచ్చేదే కాని ఒకరిస్తే వచ్చేదికాదు. ప్రేమను నటించలేము.

'చంద్రసూర్యాదుల చిత్రాలు గీయవచ్చు
కాని ఆచిత్రాలు ప్రకాశం ఇవ్వలేవు.
సన్యాసిలా నటించవచ్చు
కాని శ్రేష్ఠమయిన వైరాగ్యాన్ని తేలేము
దొంగభక్తులు భజనలుచేస్తారు
కాని ప్రేమను తేలేరు.'

భక్తియే మానవ జీవిత లక్ష్యం. దాని మాహాత్మ్యాన్ని వర్ణిస్తూ, నామదేవుడు ఇలా అన్నాడు.

'భక్తి వినామోక్షం లేదన్నది
వేదాల సిద్ధాంత వాక్యం.
అందుచేత ఆ జ్ఞానాన్ని గ్రహించి
సాధు పురుషుడు ఏం చేయాలి?
ప్రపంచం మిథ్య అని
శాస్త్రాలు చెబుతున్నాయి.
సాక్ష్యానికి సద్గురువు కావాలి.
సాధువుల సేవలు చేస్తూ
వారి అనుగ్రహాన్ని సంపాదించడమే జ్ఞానం
(అని) నామదేవుడి సిద్ధాంతం.'

భక్తియోగాన్ని విపులీకరిస్తూ ఒక అభంగ్‌లో నామదేవుడు ఇలా అంటాడు.

'వర్ణించే వారు వర్ణిస్తారు, శ్రుతులు నుతిస్తాయి
కాని హరి లభించే మార్గమే వేరు
నీకు లభించినదంతా మిథ్య. హరినామమే బ్రహ్మం
హరిలభించే మార్గమే వేరు.
తార్కికుల, చార్వాకుల వాదవివాదాలు అనంతం.
కాని హరి సుఖమే వేరు.
చాతుర్యం కలవారు, కవిత్వ పటుత్వం కలవారు,
లోకాచార నిపుణులు, జనరంజనం చేసేవారు కాదు
నిన్ను గుర్తెరిగిన వారు మౌనులు.
వారు భక్తియోగంతో నిన్ను పొందుతారు
(అని) నామా అంటాడు.'

## సాంఘిక చైతన్యం

నామదేవుడికాలంలో వర్ణభేదాలకు, వ్రత-నియమాలకు, దేవతలకు, దేవుళ్ళకు అతిగా ప్రాధాన్యం ఉండేది. నామదేవుడు జాతివర్ణభేదాలను, మతం

పేరిట చలామణి అవుతున్న మౌఢ్యాన్ని తీవ్రంగా నిరసించారు. చిత్తశుద్ధిలేని తీర్థయాత్రలు, పూజాదికాలు, విగ్రహారాధనలు వ్యర్థమని నొక్కి చెప్పారు.

నామదేవుడు తను 'శింపి' (దర్జీ) జాతికి చెందినవాడనంటూ, జాతికంటే భక్తి శ్రేష్ఠతరమయినదని ఈ క్రింది అభంగ్‌లో ప్రతిపాదించాడు.

'పరుసవేదిని స్పృశించిన ఇనుము బంగారమవుతుంది.
ఆ తరవాత దాన్ని ఇనుము అనరు.
చిన్న చిన్న సెలయేళ్ళు గంగానదిలో కలుస్తాయి
ఆ తరవాత వాటిని సెలయేళ్ళు అనరు.
నీచజాతికి చెందినవాడు భక్తియుక్తుడు (అయితే)
వాడి పుట్టుజాతిని ఎవరూ పరికించరు.'

జాతినిబట్టి మనిషి విలువ కట్టకూడదని ఇంకో ఉదాహరణ ఇస్తూ నామదేవుడు ఇలా అంటాడు,

'గడ్డిగాదంలో తులసి మొక్క పుట్టింది
దాన్ని అపవిత్రమని ఎవరూ అనరు.
కాకిరెట్టలోనుంచి రావిచెట్టు మొలిచింది
దాన్ని అశుభమని ఎవరూ అనరు.
దాసీపుత్రుడికి రాజపదవి లభించింది
వెనకటి వృత్తాంతం ఎవరూ చెప్పరు.
నేను పుట్టుకతో శింపి జాతి వాణ్ణి
కాని నన్ను ఆ జాతితో జోడించకండి
(అని) నామా అంటున్నాడు.

సవర్ణుల పట్లనేకాక అసర్ణులూ-అస్పృశ్యులు అనబడే చోఖామేలా వంటి సమకాలికులయిన సాధువులపట్ల నామదేవుడి ప్రవర్తన ఆయనకు కల వ్యాపకమయిన మానవతావాదదృక్పథాన్ని సూచిస్తుంది. చోఖామేలా శిష్యుడు బంకా ఒక అభంగ్‌లో ఇలా అంటాడు.

'నామదేవుడు చోఖా శిరస్సును స్పృశించాడు
విఠల నామోపదేశం చేసాడు

చోఖా నా గురువుతో సమానం
ఆయన చరణాలకు వందనం.'

నామదేవుడు అంటరాని వాడయిన చోఖామేలా శిరస్సును స్పృశించి అతనికి ఉపదేశం చేసాడు. అంతేకాదు, మంగళ్‌వేఢ్ అనే చోట గోడ విరిగిపడి, చోఖాబా మరణిస్తే, అతని అస్థికలను గుర్తించి, పండరిపురంలో, తన మహా సమాధి దగ్గరనే అతని సమాధి ఏర్పరచాడు. నామదేవుడి జీవితంలో ఇది ఒక చెప్పుకోదగిన సంఘటన.

నామదేవుడి కాలంలో తీర్థయాత్రలకు ఎంతగానో ప్రాధాన్యం ఉన్నదన్న సంగతి నామదేవుడి అభంగాల ద్వారా తెలుస్తుంది. తనకు సమకాలికులయిన సాధు పుంగవులతో నామదేవుడు చేసిన తీర్థయాత్రలు సుప్రసిద్ధాలే. అయినా మనస్సు నిర్మలంగా లేకపోతే తీర్థయాత్ర చేయడం వ్యర్థమన్న కఠోరసత్యం ఈ క్రింది 'అభంగ్'లో గోచరిస్తుంది.

'మనస్సు దుర్గుణాల ప్రోవయితే
తీర్థయాత్రలవల్ల ఫలమేమి?
మనస్సులో ఆరాటంతో
తపస్సు చేస్తే లాభమేమిటి?
మనస్సంకల్ప రూపాలయిన పాపాలను
లక్షతీర్థయాత్రలు పోగొట్టలేవు.
పశ్చాత్తాపం మూలానే పాపాలు నశిస్తాయి
(అని) నామా అంటున్నాడు.'

ఇంకో రెండు ఉదాహరణలలో, ఈ విషయాన్ని ఇంకా స్పష్టం చేసాడు నామదేవుడు.

'చేదుమూలికలను పంచదారలో ముంచితేలిస్తే
చేదుతనం పోతుందా?
తీర్థాటన చేసినంత మాత్రాన
మనస్సు నిర్మలమవుతుందా?
మైలతుత్తాన్ని పాలలో పొంగిస్తే
దానిగుణం పోతుందా?

సత్సాంగత్యం కల పుణ్యాత్ములకు మాత్రమే
కాలాంతరంలో ముక్తి లభిస్తుంది.'

అనగా, తీర్థాలకు తీర్థం, సమర్థమయిన నామమంత్రం. 'తప-దాన-వ్రత-యజ్ఞాలు ఎన్ని కోట్లయినా, హరినామం ముందు దిగదుడుపే!' అని స్పష్టంగా ఉద్ఘాటించాడు.

తీర్థాటనలనే కాకుండా ఆ రోజుల్లో వేరువేరు దేవతల పేరిట జరిగే వ్యాపార సరళిని కూడా నామదేవుడు నిరసించాడు.

'కసాయివలె వ్యాపారం చేస్తారు
మనస్సులో ఎప్పుడూ దుష్టచింతలే.
దుష్టులు, దురాచారులు పాతకులు
వీరంతా
దుర్బలులను నాశనం చేయాలని తలుస్తారు.'

నామదేవుడి రచనలన్నింటినీ—ముఖ్యంగా ఆయన రచించిన రూపక ప్రధానాలయిన అభంగాలనూ, తన జీవిత కథ చెప్పుకున్న అభంగాలను-పరిశీలిస్తే ఆయన తన చుట్టుపట్ల ఉన్న సమాజాన్ని సునిశితంగా పరిశీలించాడని తోస్తుంది. ఆయన ప్రధానంగా ఆత్మనిష్ఠుడయిన సాధకుడూ, భక్తుడూ అయినప్పటికి సామాజిక స్పృహ కలిగిన వ్యక్తి అనడంలో ఎటువంటి సందేహమూ లేదు.

నామదేవుడికి కేవలం తన్ను దా నుద్ధరించుకుందామనే ధ్యాసలేదు. ఆయన ఎన్నో అభంగాలలో తనలాంటి భగవద్భక్తులను సాముదాయికంగా ఉటంకించాడు. వారి సుఖమే తన సుఖమనుకున్నాడు. మాలాంటి భక్తులలో ఎన్నో దోషాలున్నప్పటికీ, మాకు యమధర్మరాజు భయం లేదంటూ, నామదేవుడిలా అన్నాడు.

'ప్రేమ లేకపోతే రాజు తన కాంతామణి నయినా వదలివేస్తాడు
కాని వారి అధికారం భూమిమీద ఉన్నంతసేపే,
అహంకారపూరితులమయిన మేము నీ భక్తులం
యమదూతలను కాళ్ళక్రింద రాచేస్తాం.
రాజపుత్రుడు అపరాధియే అయితే
అతడు ఇతరులను ఎలా దండించగలుగుతాడు?

మాలో లక్షా తొంభయి దోషాలున్నాయి
కాని జగత్పిత మా వాడు
(అని) నామా అంటున్నాడు.'

నామదేవుడు భజనల్లో తన్నుదా మరచిపోయాడు. ప్రపంచంలో జ్ఞానదీపం వెలిగించాడు, భాగవత ధర్మ మర్మాన్ని గ్రహించాడు. 'హరిదాసులలో (భక్తులలో) నీవు అందరికంటే వేరు, ప్రేమ స్వరూపుడివి' అని అనిపించు కున్నాడు. జ్ఞానదేవుడు 'నీవు విఠోఖా పుత్రుడివి. ఓనామా! మాపై కృప చూపించు' అన్నమాట చాలా విలువ కలది. నామదేవుణ్ణి గురించి జ్ఞానదేవు డిట్లా అనడంలో ఎంతయినా సత్యమున్నది. సంతమండలి (సాధు సమూహం) హరిదాసులకు మేలు కలగాలన్న నామదేవుడి దృక్పథం ఎంత కరుణాపూరితమో, నామదేవుడి మాటల్లోనే వినండి.

సమస్త హరిదాసులకు వారి వంశాలకు
అనంతమయిన ఆయువు లభించాలి.
వారికి ఎప్పుడు ఆర్థికమయిన ఇబ్బంది కలగకూడదు
ఈ సంతమండలి సుఖంగా ఉండాలి,
వారికి రజోగుణ యుక్తమయిన అహంకారం కలగకూడదు.
పాండురంగ నామ నిధానమయిన ముఖం (నోరు) కలవారికి
ఎల్లప్పుడూ సుఖాలే కలగాలి.

# కవిత్వం - వ్యక్తిత్వం

'కవిత్వంలో కూడా కవిత్వం ఇమిడి ఉంది
కాని నామదేవుడి కవిత్వంలో ఉన్న విశేషం
నాకు అంతుబట్టలేదు.
ఏమని పొగడేది ? ఎంతని పొగడేది?
పాలమీది మీగడలాంటి పాట పాడతాడు నామదేవుడు.'

(పరసా భాగవత్)

మహారాష్ట్ర ప్రాంతంలో బ్రహ్మవిద్యా సుఖాన్ని పెంపొందించాలన్నదే జ్ఞానదేవుడి లక్ష్యం, కాని కేవలం మహారాష్ట్ర ప్రాంతంలోనే కాకుండా, ఇతరత్రా కూడా ఇంత విస్తృతంగా బ్రహ్మ విద్యను వ్యాపింపచేసిన గౌరవం నామదేవుడిదే అనడంలో ఎటువంటి అతిశయోక్తిలేదు. 'భాషలో (సాహిత్యంలో) కవిత్వం గొప్పది, కవిత్వంలో రసికత్వం గొప్పది, రసికత్వంలో కూడా పరతత్త్వస్పర్శ కలిగించేది గొప్ప ! ఇలా జ్ఞానదేవుడి విశిష్ట ప్రతిభకు పరతత్త్వ స్పర్శకలిగింది అనడంలో ఎటువంటి సందేహమూ లేదు. అయినా

పరతత్త్వం కంటికి కనబడాలి, సుఖపర్వాన్ని పొందాలి
మహాజ్ఞానంతో సమృద్ధమయి విశ్వం ముందడుగు వేయాలి.

(జ్ఞానేశ్వరి — 13-173)

అన్న జ్ఞానదేవుడి కోరికను నామదేవుడు నెరవేర్చాడు. నామదేవుడి కవిత్వానికి పరతత్త్వం రూపుకట్టుకొని సాక్షాత్కరించింది. పండరిపురంలో ఇటికమీద నిలబడ్డ పరతత్త్వాన్ని ఆయన స్వయంగా తన చర్మచక్షువులతో చూసాడు, ఆ ప్రత్యక్ష సుఖానుభూతిని అనుభవించాడు. అందుచేతనే సమస్త విశ్వాన్ని మహాజ్ఞాన సమృద్ధిలోకంలో ప్రవేశింపచేసిన మహత్కార్యం నామదేవుడి ద్వారా జరిగింది.

'శాంతరసంలో అద్భుతరసం అతిథిగా ప్రవేశించింది' అన్నది జ్ఞానదేవుడి పరిస్థితి, కాని స్వయంగా జ్ఞానదేవుడు అన్నట్లు 'నామదేవుడు నోరువిప్పడం అంటే కవిత్వమేకాదు, అది నిరూపమాన అద్భుతరసం. నామదేవుడి వాక్కు అద్భుతరసంతో ఓలలాడుతూ ఉంటుంది. జ్ఞానేశ్వరిలోనూ, జ్ఞానదేవుడి ఇతర రచనల్లోనూ నిండివున్న భక్తిరసం, నామదేవుని రచనాప్రవాహంలో రెండు

గట్లను ఒరుసుకొని ప్రవహించింది. శాంత, అద్భుత, కరుణ రసాలతో నిండారిన నామదేవుడి రచన భక్తిరసంలో తలమునకలయింది.

## జ్ఞానం - నామం

గంగా యమునలు చాలా దూరం సమానాంతరంగా ప్రవహించి చివరకు ప్రయాగలో కలిసి ఒకటయిపోతయి. అదేవిధంగా జ్ఞానేశ్వరుడి జ్ఞాన భక్తితోనూ, నామదేవుడి నామభక్తితోనూ-ఈ రెంటి పరస్పర సంగమంతోనూ మరాఠీ కావ్య జగత్తు పునీతమయింది. నిజానికి జ్ఞానమూ, నామమూ ఒకటయితే ద్వైత భావానికి ఆస్కారంలేదు. 'నామదేవుడి దర్శనానికి జ్ఞానదేవుడు వచ్చాడు. నామదేవుడు సాష్టాంగ ప్రణామం చేసాడు.' 'ఆతణ్ణి (ఆ పరమాత్ముణ్ణి) నా కండ్లకు సాక్షాత్కరింపచేసావు అని జ్ఞానదేవుడు నామదేవుడికి చరణాభివందనం చేసాడు.' ఇలా ఇద్దరూ ఒకరినొకరు గౌరవించుకున్నారు, తమ ప్రతిభతో ప్రకాశిస్తున్న ఆ ఇద్దరు మహాకవులను సరిపోల్చి చూసి ఒకరు గొప్ప, ఒకరు తక్కువ అని చెప్పడం అర్థరహితం. జ్ఞానదేవుడి పద్దనుండి తాను గ్రహించిన లబ్ధికి నామదేవుడు ఎన్నో 'అభంగాల'లో కృతజ్ఞతలు చెప్పకున్నాడు. సుప్రసిద్ధ మయిన ఒక 'అభంగ్'లో

'నిగమ వల్లికలను ప్రసాదించిన
నా జ్ఞానదేవుడు యోగులకు మాతృస్వరూపుడు
గీతకు ఆభూషణం జ్ఞానేశ్వరి
అట్టి బ్రహ్మానంద తరంగాలను అందించాడు
ఆధ్యాత్మ విద్యకు రూపు కట్టించాడు.
చైతన్య దీపాన్ని ప్రజ్వలింప చేసాడు
ఛప్పన్న భాషలకు గౌరవం ఆపాదించాడు
భవార్ణవాన్ని నామమే ఉద్ధరిస్తుంది.
అది శ్రవణమార్గం ద్వారా ప్రవేశిస్తే
హృదయం సుఖమయమవుతుంది
జ్ఞానేశ్వరి శ్రేష్ఠ గ్రంథం
అని నామదేవుడు అంటున్నాడు.'
(అందులోని)
ఒక్క 'ఓవీ'నయినా అనుభవంలోకి తెచ్చుకోవాలి.

ఈ అభంగ్‌లో నామదేవుడు భగవద్గీతను గురించీ, జ్ఞానేశ్వరిని గురించీ తెలిపిన విషయాలు ఆయన సూక్ష్మదృష్టిని తెలియచేస్తాయి.

ఇంకో 'అభంగ్'లో ఆయన ఇలా అన్నాడు. (దాంతో)

జ్ఞానదేవుణ్ణి తనివిదీరా చూసాడు.
నామదేవుడి హృదయం ఆనంద తరంగితమయింది.
చరణాలను ఆశ్రయించాడు. నీవు సద్గురురాజవన్నాడు
నన్ను నిరాకరించవద్దు, దూరం చేయవద్దు.
నీ భక్తి స్వరూపాన్ని సదా స్మరిస్తూ ఉంటాను.'

నామదేవుడి అభంగాలలో నిజంగానే జ్ఞానేశ్వరుడు ప్రపంచించిన భక్తి స్వరూపం గోచరిస్తూ ఉంటుంది. జ్ఞానదేవుడు నామదేవుణ్ణి ప్రశంసిస్తూ ఇలా అన్నాడు. 'పండరిపుర దేవుని ప్రేమ-భాండాగారానికి అధ్యక్షుడివి నీవు. భక్తులను గురించి చాలా విన్నాం. భక్తులు పుట్టారు, ఇంకా ముందు కాలంలో కూడా పుడతారు. కాని నామదేవుడు మూర్తీభవించిన ప్రేమస్వరూపం. అంతరంగ భక్తుడు'. పైన చెప్పిన విషయాలన్నింటిని దృష్టిలో ఉంచుకుంటేనే నామదేవుడి కృతిత్వానికి సరిగ్గా విలువకట్టడానికి వీలవుతుంది.

## చంద్రభాగాతీరంలో విన్న కథలు

తనకు కవిత్వ రచనకు ప్రేరణ కలిగిన విషయాన్ని గురించి నామదేవుడు ఒక 'అభంగ్'లో ఇలా అంటాడు.

'చంద్రభాగా నదీ తీరాన కథలు విన్నాను
వాల్మీకి శతకోటి గ్రంథ రచన చేసాడని విన్నాను.
జీవితమంతా వ్యర్థమయిందని చాలా బాధపడ్డాను
గుడిలో విఠోభాముందు మోకరిల్లాను.
వాల్మీకి రచించాడు రామాయణం
నేనే నీకు నిజమయిన భక్తుణ్ణయితే
నిన్ను పొగడుతూ శతకోటి అభంగాలు రచిస్తాను
నా ప్రతినను నెరవేర్చు.
వాల్మీకి కాలంలో ఆయుర్దాయాలు పెద్దవి
కాని నేడు ఆయుర్దాయాలు తక్కువ

ప్రతిన నెరవేరకపోతే
నీముందు నాలిక తెగకోసుకుంటానని నామా అంటున్నాడు.'

నామదేవుడి ఈ భీష్మ ప్రతిజ్ఞ విని పాండురంగడే పుస్తకాలు ముందు వేసుక్కూర్చున్నాడని, తనే స్వయంగా అభంగాలు రచించాడనీ చెబుతారు. శతకోటి అభంగాల రచన అంటే అతి శీఘ్రంగా వ్రాయడమని ఆచార్య వినోబా అర్థం చెప్పారు.

హరికృపవలన తనకు అభంగ ఛందోలక్షణాలు కలలో సాక్షాత్కరించాయనీ, విసోబాఖేచర్ అతి ప్రేమతో అనుగ్రహించాడనీ నామదేవుడు వ్రాసుకున్నాడు. ఈ క్రింది అభంగ్ ఆధారంగా నామదేవుడికి అభంగ ఛందోలక్షణం తెలుసునని స్పష్టమవుతుంది.

'అభంగరూపం నాకు తెలియదు.
భగవంతుడు అనుగ్రహించాడు దాన్ని నాకు.
అక్షరాల సంఖ్య అమితమని చెబుతారు
మేరువనీ, సుప్రచండమనీ, శరమనీ ఎన్నో అంటారు.
ఆరు, మూడున్నర చరణాలని తెలుసుకోండి
అక్షరాలు లెక్కించండి, నాలుగు ఇరవైలు
ఒకటినుంచి మూటిదాకా
పద్దెనిమిదని లెక్కించండి.
నాలుగు ఇరవైలు 'మాతృక' అనిపించుకుంటాయి
చివరి పంక్తిలో ఇరవైరెండు అక్షరాలు
ఒకటిన్నర చరణాల్లో అక్షరాలు దీర్ఘాలు
ముముక్షువు ఆలోచించి చూసాడు
నాకు కలలో హరిదర్శనమిచ్చాడు
ప్రేమతో ఖేచరుడు ఆజాపించాడు
(అని) నామా అంటున్నాడు'

## వ్యుత్పత్తి జ్ఞానం వ్యర్థం

నాకు అభంగ ఛందోలక్షణ జ్ఞానం లేదని నామదేవుడు అన్నప్పటికీ, భాగవత ధర్మ మర్మం తెలిసినట్లే, ఆయనకు అభంగ లక్షణ జ్ఞానం కూడా

తెలుసు. నాకు కళాకారుడి కళాకౌశలం తెలియద'నీ, 'హృదయంలో ప్రేమ ఉప్పొంగినపుడు నేను ఏ ఛందస్సులో పాడతానో, అందులోనే మునిగి తేలాను' అని అన్నాడు. ఇంకో అభంగ్‌లో

'ప్రేమోన్మాదం అంకెలలో నిండిఉంది
పాటతో నన్ను నేను మరచిపోతాను
ఏ సమయంలో ఏం పాడాలో భగవంతుడికే తెలుసు,
నాకు తెలియదు
గాలిలాగానే నా హృదయం మ్రోగుతుంది
కరతల, మృదంగాలు దక్షిణంవైపు
నేనేమో పడమటివైపు, పొంతనలేదు.
బిడ్డడి ముద్దు పలుకులు
తల్లికి ముద్దే
జన్మ జన్మాలకు నీ సేవ చేసే అవకాశం ఇవ్వమని
నామదేవుడు విన్నవించుకుంటున్నాడు.'

భగవత్ప్రాప్తికి మనస్సులో 'తహ తహ' కావాలి. దానికి పుస్తకాలు చదివితే వచ్చే పాండిత్యంకానీ, పుస్తకాల గాడిదల మోతలుకానీ అవసరంలేదు. 'అందరిపట్ల సమమయిన భూతదయ కలిగిఉండి 'భగవంతునిపట్ల భావయుక్తమయిన భక్తి' కలిగి ఉంటే చాలునన్న విషయం నామదేవుడికి తెలుసు.

అంతేకాదు, భక్తివినా శబ్దజ్ఞానం వ్యర్థం. 'చిత్తంలో భక్తిలేనివాడి వ్యుత్పత్తి తగలబెట్టవలసిందే'నని ఆయన స్పష్టంచేశాడు. 'వ్యుత్పత్తి వ్యర్థం, శ్రుతులకు అర్థాలు చెప్పటం వ్యర్థం. విషయవాసనల తృప్తికి వాటితో ఏంపని?' అని అంటూ ఆయన వ్యుత్పత్తి అనగా పుస్తక పాండిత్యం వ్యర్థమని ఎలుగెత్తి చాటాడు.

'ఓరి పిచ్చివాడా! ఆ ప్రియరూప పరిచయం లేదా ?
జన్మ ఎత్తావంటే, ఒక సమస్యను పరిష్కరించాలి
ఓ శ్రీహరీ! నీకు తెలుసు ఏం చేయాలో
నా మర్యాద నిలబెట్టడం నీ కర్తవ్యం
చాలామంది ముఖతః నీ కీర్తి విన్నాను
శరణాగత భక్తులు స్తుతించారు ఎంతగానో

నన్ను త్వరగా తరింపచేయి
నామా అంటున్నాడు
శరణు జొచ్చిన దీనుణ్ణి, అనాథుణ్ణి'.

నేనుపుట్టి నీకు బాధలు కల్పించాను. నన్ను ఎలా త్వరగా రక్షిస్తావో అంటాడు. ఇలా శాస్త్రాధ్యయనం వ్యర్థమని చాటినా, ఆయనకు అభంగ రచన లోని మర్మం (రహస్యం) తెలుసు

వేదాధ్యయనం, జ్యోతిష పారాయణం చేసినందువల్ల
నామాకు ఏమీ లభించలేదు
హరినామ స్మరణలేని అధ్యయనం
అది వ్యర్థం'

వ్యుత్పత్తిజ్ఞానం వ్యర్థమని అన్నా, తన సాధనావస్థలో నామదేవుడు తన జిజ్ఞాసాప్రవృత్తిని విడిచిపెట్టలేదు. జిజ్ఞాసాప్రవృత్తి, పృచ్ఛావృత్తి ద్వారానే ఉత్తమజ్ఞానం కలుగుతుంది. ఇది అర్థమయితే కాని వ్యుత్పత్తి వ్యర్థమనే విషయం బోధపడదు.

## కావ్య ప్రేరకతత్త్వాలు

నామదేవుడిలో ఈ పృచ్ఛావృత్తి ఎంత తీక్షణంగా ఉండేదో, ఆయన కావ్యరచనకు ప్రేరకతత్త్వాలు ఏవో తెలుసుకోడానికి ఈ అభంగ్ ఉపకరిస్తుంది.

వేదపండితులను తత్త్వంగురించి అడిగాను.
వారు విధి-నిషేధాలను గురించే చెప్పారు
దానివలన మనస్సుకు సమాధానం కలగలేదు
అహంకారమే బలిసింది
అందుచేతనే నామాన్ని ఆశ్రయించాను
పాండురంగా! అంతా సరిచేయవయ్యా!
శాస్త్రజ్ఞులను స్వరూపజ్ఞానం గురించి అడిగాను
వారు రకరకాల భేదభేదాలు చెప్పారు
ఒకరి అభిప్రాయంతో ఇంకొకరికి పొంతన కుదరలేదు.
భ్రాంతి-గర్వం ముసురుకున్నాయి.
పౌరాణికులను అడిగాను భగవత్స్వరూపం గురించి
కాని వాళ్ళకు తీరిక ఎక్కడిది?

విషయ వాసనల్లో మనస్సు ఉంటే బ్రహ్మజ్ఞానం ఎక్కడ?
నాకు సమాధానం ఎక్కడ?
హరిదాసులను భక్తిరహస్యాన్ని గురించి అడిగాను
కాని వారిదగ్గర భావమెక్కడ?
నామమహిమను సంకీర్తనం చేసి పాడతారు
కాని మనస్సు మాత్రం విషయవాసనల్లో లగ్నం
ఓ పాండురంగా! అడిగి అడిగి వేసారి
నీశరణు జొచ్చానయ్యా!
ప్రపంచంలో ఉండి భయభీతుణ్ణియ్యాను
నన్నుతరింపజేయవయ్యా!
నామా నిన్ను నిరతం ప్రార్థిస్తున్నాడు'

ఇలా ఎక్కడా మనస్సుకు సమాధానం దొరకక, శాంతి లభించక. విసుగెత్తి పోయి, చివరకు నిన్నాశ్రయించాను అని నామదేవుడు ఉద్ఘోషించాడు.

నామదేవుడి కవిత్వంలో ఒకటే ఒక ప్రేరకతత్త్వం గోచరిస్తుంది. అది అహంకార, ద్వైతభావ రహితంగా, విషయ వాసనలూ, మానసికంగా అశాంతి లేకుండా అనన్యభావంతో భగవంతుణ్ణి ఆశ్రయించడం విషయ వాసనా రహిత మయిన కవిత్వ ప్రేరణ పట్ల నామదేవుడికి అచంచల విశ్వాసం. నేటిదాకా తమను తాము ఉద్ధరించుకున్న భక్తులకూ, తనకూ భేదం ఉన్నసంగతి నామదేవుడికి తెలుసు.

'శరణాగతుణ్ణాయి విషయత్రాల్యాన్ని వదలేసాను.
నారాయణా! దాన్ని నీవు అంగీకరించావు కదా!
మమ్ములను సంతోష పెట్టడానికి
ఏదో దిగివస్తావు.
అజ్ఞాని, బాలుడు అయిన ధ్రువుణ్ణి మోసగించావు

* ఆమ్హీ శరణాగతీ సాండిలీ వాసనా
తే త్వాం నారాయణా అంగికారిలీ
మ్హణోని ప్రసన్నహ్వావయా ఆముతే
వోసరత్యా చిత్తే చాలవిసీ
అజ్ఞాన్ బాలక్ ఠకవిలా ధురూ

నేను అలా ఆదుర్దా పడటంలేదు సుమా!
విభీషణుణ్ణి లంకకు రాజుని చేసావు
ఉపమన్యుడు క్షీరంకోసరం హఠంచేసాడు
నేను అలాంటి బుద్ధిహీనుణ్ణికాదు
నేను అలాంటి అజ్ఞానిని కాదు
అడిగితే సమస్త శరీరాన్నే ఇచ్చివేస్తాను'

ధ్రువుడు, విభీషణుడు, ఉపమన్యుడు మొదలయిన భక్తులంతా మాయలో పడ్డారు. అందుచేతనే నీచేత మోసగింపబడ్డారు. ధ్రువుడు అచల పదంకోసం, విభీషణుడు లంకారాజ్యం కోసం, ఉపమన్యుడు క్షీరంకోసం పాకులాడారు నాది అలాంటి కామ్యభక్తికాదు. నేను వాళ్ళలా ఆతురత పడడంలేదు నేను అజ్ఞానిని కాదు, బుద్ధిమాంద్యం అసలే లేదు. నేను నామనస్సులో ఏదో కోరికపెట్టుకొని, మిమ్ములను స్తుతించడం లేదు. నేను నా సర్వస్వం మీకు సమర్పించడానికి సిద్ధంగా ఉన్నాను. నిన్ను శరణుజొచ్చి, నేను అన్ని కోరికలనీ త్యజించివేసాను. కాని ఇప్పుడు నీవు వాటిని స్వీకరించావు. కనుక నీవు నీ యోగ్యతను గుర్తించి, ఆలోచించు నా విషయం అని అంటున్నాడు నామదేవుడు.

ప్రపంచమంటే విసుగెత్తి నేను నీ శరణు జొచ్చాను. మేము నీ శరణు కోరుతున్నాం కాబట్టే నీకు ఇంతగౌరవం. ఓహో చతుర శిరోమణీ! మేము నిన్ను స్వీకరించాం కనుకనే నీకు ఇంత గుర్తింపు లభించింది. నిజానికి నీవు పేరు, రూపం, జాతి, కులంలేనివాడివి. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు వర్ణించి-వర్ణించి విసుగెత్తి నిన్ను వదలివేసాయి. నీకు నాలాంటి భక్తులు లభించబట్టే, నీకు భక్తవత్సలుడనే బిరుదువచ్చింది సుమా!

---

* తైసామీ అధిరూ నవ్హేజాణ్
లంకాపతీకేలా తువాఁ విభీషణ్
ఝాలాసీ ఉత్తీర్ణ వాచాబుణేఁ
ఉపమన్యే ఘేతలా దుధాచీ ఛంద్
తైసా బుద్ధిమంద్ నవ్హేజాణ్
నామాహ్మణేతైసా నవ్హేమీ అజ్ఞాన్
మాగ్‌తుజ్ దేఈన్ శరీర్ అవఘేఁ

'వేల నామాలతో కూడా నీవు సంపన్నుడివి కాలేదు
అది మేము ఇచ్చిన గొప్పదనమే
లేకపోతే నీకు ఎన్ని పేర్లున్నాయో ఎవరికి తెలిసేది ?
మా మూలానే నీకు గౌరవం లభించింది
మా జీవభావం నీ చరణాలకు అర్పితం
కేశవా! నీకు తెలివేగనక ఉంటే
ఈ విషయాన్ని గురించి తీవ్రంగా ఆలోచించు'.

భగవంతుణ్ణి స్తుతించాలనే ఆవేశం కలుగుతుంది. అప్పుడు నోటికి ఏదివస్తే అదే పాడేస్తాను. అని అంటూ

'నిన్ను కీర్తనలతో పట్టుకోలేనయ్యా
ప్రేమతో నీ చరణాల దగ్గర పడి ఉండనీ
ఏదో నోటికివచ్చింది
పాడదామని ఉల్లాసం కలిగింది
అందుకని తోచింది పాడుతూ ఉంటాను
నిరంతరం నామస్మరణ చేస్తూ ఉంటాను
నీవాణ్ణి అని ప్రసిద్ధి పొందాను
మరి ఎలారక్షిస్తావో
నామాను సదా-సర్వదా కేశవుడే ఉద్ధరిస్తాడు ! అని అంటాడు.

### విఠల భక్తిపట్ల నిష్ఠ

నామదేవుడి కవిత్వం విఠల భక్తికి అంకితమయిపోయినప్పటికీ ఆయన విఠలుడి నిమిత్తంగా పండరిపురాన్నీ. సాధు పుంగవులనీ ఎంతో భావోద్రేకంతో వర్ణించాడు. నామదేవుడి ప్రతి అభంగ్‌లోనూ భగవంతుని గుణసంకీర్తన, అనంతమయిన భగవద్భక్తి గోచరిస్తాయి-'సత్యభావం అదే. మిగతా వ్యుత్పత్తి జ్ఞానం అంతా వ్యర్థం. నేను చాలా ఆనందంగా పుట్టింటికి వెళతాను'-అన్నాడాయన.

నామదేవుడి ప్రతిభకు వ్యుత్పత్తి జ్ఞానం అవసరంలేదు. కాని వర్ణ్యవిషయం గురించిన ఎంతో సాధన-సామగ్రి ఆయన దగ్గరుంది. 'శ్రీకృష్ణలీల'లో

'గోపికా ఖండం'లో ఒక కీర్తనలో ఇలా అన్నాడు. 'గోపికలను మోసంచేసాడు, గోపికలను మోసంచేసాడు. మహారాష్ట్రి, కన్నడ, మహమ్మదీయ, కొంకణీ, గుజరాతీ-ఇలా ఐదుగురు గోపికలను మోసంచేసాడు.' శ్రీకృష్ణునిచే వస్త్రాపహరణం జరిగిన తరవాత యమునానదిలో నుండి పైకివచ్చి, గోపికలు తమవస్త్రాలు ఇమ్మని శ్రీకృష్ణుణ్ణి ప్రార్థిస్తారు. ఈ ప్రసంగంలో నామదేవుడు ఐదు భాషలను చక్కగా వాడాడు. కన్నడ ప్రాంతానికి చెందిన గోపిక ఇలా అంటుంది.

'లదోబాగోవిందా, లదోబా గోవిందా
నిరవాణీ ఆజ్ ఆడ్‌చాల్లో పడ్‌చాల్లో
శిర్ ఫోడ్యా‹ నకోడో‹
మారీ కన్నైయా పానీ ఖేల్యాన ఖేళో.'

మహమ్మదీయ గోపిక ఇలా అంటుంది.

'దేఖ్ రే కన్హైయా, దేఖ్ రే కన్హైయా
మై ఇజ్జత్‌కి బడీ, కదమ్ పకడూంగీ
భై కటోజుడా, మేరీచునరీ దే
మేరీ లే దుల్లడీ.'

మహారాష్ట్ర ప్రాంతానికి చెందిన గోపిక ఇలా అంటుంది.

'దేవకినందనా! దేవకినందనా!
తూ ఏక్ శ్రీపతి, ఉఘడీ హివాచీ
తుజ్ బినవూ‹ కితీ, పాయా పడతే బా
మీయేతే కాకుళతీ. మాఝీ సాడీదే
ఘే లాకాచే.'

కొంకణ దేశస్థురాలయిన గోపిక ఇలా అంటుంది.

'మోతి పావ్‌గా దాతారా, పావ్‌గా దాతారా
తూ నందాచా ఝిలో
మాకా‹, ఫడ్కోదీ, మీ హివానం మేలో.
ఘే మారేఝ కోయతో
దేవా పాయూ‹ పడ్‌ళో‹.'

గుజరాతీ గోపిక ఇలా అంటుంది.

జ్యోరే మాధవ్‌జీ, జ్యోరేమాధవ్‌జీ, మై శరణ్ థైఈ
తనకా కాకైయీ, బాప్ దయాళూ తుహీం
మారీ సాడీ అపోం హాతణీ లే కంకణీ.

తన వర్ణనలను స్వాభావికంగాను, ప్రభావపూర్ణంగాను చేయడానికి నామదేవుడు ఐదు భాషలను వాడాడు. ఇది ఆయన బహుభాషా జ్ఞానానికి చక్కటి తార్కాణం.

నామదేవుడికి ఎన్నో భాషలలో గల పాండిత్యాన్ని చూచి, మహీపతి (భక్తుల జీవితాలను గురించి రచించిన ఒకకవి) 'నామదేవ వర్ణన'లో ఇలా వ్రాసాడు. 'తీర్థాటనకు వెళ్ళిన దేశంలో మాట్లాడే ఆయా భాషల్లోనే నామదేవుడు కవిత్వం వ్రాసాడు.'

నామదేవుడు రచించిన 'గోపికా ప్రసంగం' మరాఠీభాషలో భక్తిపదాలకు మూలకందం. భక్తిరస పరమావధికి నిదర్శనాలయిన ఆయన అభంగాలు అవిస్మరణీయాలు, ఈ పదాలలో శ్రీకృష్ణభక్తి దర్శనీయం. ఉదాహరణకు ఒక అభంగ్ చూడండి.

'మల్హార మేఘాలు ఆకాశంలో అలముకొని ఉన్నాయి
మెరుపులు మెరుస్తున్నాయి, మేఘాలు గర్జిస్తున్నాయి ఓయమ్మో!
గోవిందుణ్ణి దర్శించుకోవడమెలా ?
గొప్ప జడివాన మధుధారలు కురుస్తున్నాయి ఓయమ్మో!
ఆనందంతో తమంతతామే మయూరాలు నృత్యం చేస్తున్నాయి.
ప్రేమతో అవి నీలకంఠాలయిపోయాయి ఓయమ్మో!
గోపాలుడిపట్ల మనస్సు లగ్నం అయింది ఓయమ్మో!
ఆస్వామి ఉజ్వల దృష్టితో చూడాలి
(అని) నామా అంటున్నాడు.'

ఈ అభంగ్‌లో బింబ విధానం ఎంత వ్యాపకంగా ఉందో, అంత వాస్తవికంగానూ ఉంది. స్వయంగా నామదేవుడే అభిసారానికి బయలుదేరాడు.

'రాత్రికారుచీకట్లు, మేఘాలునల్లనివి, యమునా ప్రవాహం
నల్లనిది ఓయమ్మో!

కొప్పునల్లనిది, గాజులునల్లనివి, ముత్యాల పేరు నల్లనిది ఓయమ్మో!
నేను నల్లనిదాన్ని, కంచుకం నల్లనిది, కట్టినకోక నల్లనిది,
ఒంటరిగా నీళ్ళకు పోలేనో సఖీ!
వెంట నల్లనివాణ్ణి పంపవోయమ్మా!
నామదేవుడి ప్రభువు విష్ణువు నల్లనివాడు
కృష్ణమూర్తి చాలా నలుపోయమ్మా!'

పారమార్థికంలో నిమగ్నుడయిన సాధకుడి మనోదశను పాశ్చాత్యరచయితలు 'The dark night of the soul' అని అన్నారు. తన సాధనావస్థలోని పరీక్షా సమయాన్ని నామదేవుడు 'చీకటి రాత్రి'తో పోల్చాడు.

ఈ అభంగ్‌లో నల్లని రాత్రి, నల్లనియమున, నల్లనయ్య ('కృష్ణ'మూర్తి) తోపాటు అద్వితీయమయిన శబ్దచాతుర్యం, సూచ్యమయిన ఈశ్వర ప్రాప్తినిష్ఠ, విరహార్తి, మాధుర్యభక్తి, ఆత్మీయత బహుళ మరాఠీకావ్యంలో 'నభూతో న భవిష్యతి' అంటే అతిశయోక్తికాదు.

పరమాత్ముడిలోను, భక్తుడిలోను అద్వైతాన్ని వర్ణించే ఈ అభంగ్‌లో నామదేవుడి ప్రతిభను చూడండి.

'నీవు అంతరిక్షం, నేను భూమిని
నీవు లింగం, నేను పానవట్టం,
నీవు బృందావనం, నేను పక్షిని,
నీవు తులసివి, నేను మాలను,
నీవు చంద్రుడివి, నేను వెన్నెలను
నీవు సూర్యుడివి, నేను పద్మాన్ని
నీవు కృష్ణుడివి, నేను రుక్మిణిని
రెండూ నీవే
నీవు నదివి, నేను తీరాన్ని
నీవు నౌకవు, నేను తెరచాపను
నీవు ధనుస్సువు, నేను తూణీరాన్ని
రెండూ నీవే
నీవు వేదానివి, నేను స్తోతను

నీవు శాస్త్రానివి, నేను గీతను
నీవు చందనం, నేను అక్షతలు
రెండూ నీవే
హే పురుషోత్తమా! నీ ప్రేమకు నేను అంకితమయి పోతున్నాను
నీవు ఆత్మవి, నేను శరీరాన్ని
రెండూ నీవు.

## భక్తి వివిధ రూపాలు

నామదేవుడు విఠలుని పట్ల తన ప్రేమను వ్యక్తీకరిస్తూ, అతని సాక్షాత్కారాన్నీ, ఎడబాటునూ, ఎదురు చూపులనూ, స్తుతులనూ, తన దైన్యాన్ని యెన్నో రకాలుగా వర్ణించాడు. భగవంతుడుగా కాకుండా మానవుడికి మరో మానవుడితో ఉండే సంబంధాలన్నింటినీ కల్పించుకున్నాడు కాని మాతృ స్వరూపంలో విఠలుణ్ణి స్మరించేటప్పుడు నామదేవుడి ప్రతిభ అద్వితీయం.

'విఠలు డనే తల్లి అనుగ్రహం కోమలం
స్మరించగానే ప్రేమ అనే చనుబాలనిస్తుంది.
నీవు తల్లివి, నేను నీ దూడని.
ఓ పాండురంగా! నీ కృపను తగ్గించబోకు.
నీవు లేడివి, నేను నీ పిల్లను
భవపాశాలను త్రెంచివేయి పాండురంగా!
నీవు విహంగానివి, నేను నీ బిడ్డను
నాకు ఆహారం అందించు పాండురంగా!
భక్తవాత్సల్యాన్ని చూపించు
ముందు-వెనకల సంబాళించుకునే వాడివి నీవే
అని నామా అంటున్నాడు.'

అతి ప్రసిద్ధమయిన ఈ అభంగ్‌లో నామదేవుడి వాత్సల్య భక్తిలో గల ఆర్తత్వం కనిపిస్తున్నది. ఈ ఆర్తత్వం 'ఎప్పుడు కనబడతావు నా ప్రాణ సఖా! తల్లివి-తండ్రివి నీవే పాండురంగా!' అనే కీర్తనలో కూడా గోచరిస్తుంది.

విఠలుణ్ణి కలుసుకుందామనే ఆదుర్దాను నామదేవుడు కావ్యానురూపంగా

మలచుకున్నాడు. హృదయాన్ని ఆకట్టుకునే అభంగాలు ఎన్నో ఉన్నాయి మచ్చుకు ఒకటి చూడండి:

'ఎందుకు ఇంత ఆలస్యం?
ఎవరయినా భక్తుడు నిన్నాపాడా?
విఠలా! త్వరగా రావయ్యా
నిన్ను పిలిచీ-పిలిచీ నాగొంతు తడారిపోతున్నది.
దశదిశల్లో నీకొరకు ఎదురు చూస్తున్నాను.
నా ప్రాణాలకు నీవే ఆధారం
ఎప్పుడు ఆ ఘడియ వస్తుంది?
ఎప్పుడు చతుర్భుజుణ్ణి మనసారా ఆలింగనం చేసుకుంటాను?
నామదేవుడు ప్రేమోత్సాహాలతో నిండిపోయాడు
శరీరం మట్టిమీద పొర్లాడుతున్నది.'

ఈ అభంగ్‌లో భక్తి ఆర్తతే కాకుండా, ఈశ్వర సాక్షాత్కారానికి ఆలస్యం ఎందుకు అయిందో అన్న మీమాంస, పిలిచీ-పిలిచీ గొంతు తడారిపోవడం, దశ దిశలనుండి వచ్చే పరమాత్ముడికై ప్రతీక్ష, భక్తి పట్ల విశ్వాసం, ఈశ్వరుడే తన ప్రాణమనీ, అతణ్ణి ఆలింగనం చేసుకుందామనే ఆకాంక్ష, తద్వారా కలిగిన సాత్త్విక ప్రేమోత్కర్ష, దేహ-సమర్పణ-అనే నానాభావాలను అతి తక్కువ మాటల్లో వెల్లడించాడు నామదేవుడు.

'ఆదిగ్రంథం'లో 'రాగ్ భైరవ్' అనే కీర్తనలో నామదేవుడు ఇలా అంటాడు:

'బాలుడికి, తల్లికి మధ్యగల ప్రేమ
అలాంటిదే హరిపట్ల నా ప్రేమ.
ప్రణవంపట్ల నామదేవుడి ప్రీతి.
గోవిందుడు నా చిత్తంలో పాతుకోపోయాడు.'

బాలుడికి, తల్లికి మధ్య ఉండే వాత్సల్యభావంతో నా మనస్సు హరిపట్ల లగ్నమయింది. పరమాత్ముడిపట్ల నాకు అనురాగం, నా మనస్సు ఆయన నివాసం.

## కల్పనా వైభవం

పరమాత్ముడితో సంయోగం, అలగడం లాంటివి కూడా నామదేవుడి విరహభక్తిలో మనసు ఆకట్టుకుంటాయి.

'నడుంమీద చేతులుంచి నిలబడ్డారు.
చూడండి-అచిత్త చోరుడు.
నాలెక్క తేల్చవయ్యా కేశవా!
84 లక్షల జన్మల్లో నిన్ను సేవించాను
నా బాకీ తీర్చవయ్యా దేవా!
లేకపోతే నీ సేవకుణ్ణి పట్టుకుంటాను
నన్ను అనవసరంగా వేధించకు
పిచ్చెక్కిందంటే నీ చరణాలు విడవనే విడవను.'

బాకీ, బాకీ తీర్చకపోతేకోపం, కాళ్ళుపట్టుకొని విడవననడం అనే ఊహ ఎంతో మధురమయినది.

'కల్పతరువు క్రింద కూర్చున్నవాడికి ఆశించిన ఫలం దొరక్క పోవడం
కామధేనువును పితికినా ఉపవాసంతో చావడం
ఎంత విచిత్రం!
జరిగేదేదో జరుగుతుంది, పోయేవాడు పోతాడు.
ఏమిటయ్యా కేశవా! నీ గొప్పదనం?
నీ తుంటరితనాన్ని సంత్-మహంతుల ముందు
బట్టబయలు చేస్తాను.'

'సంత్ మహంతుల ముందు నిన్ను అపకీర్తి పాలు చేస్తాను. నీకు సిగ్గూ-శరమూలేదు. నీ గొప్పదనాన్ని ఎంతని వర్ణించేది? నిన్ను అవమానించకుండా, ఉండను,' భగవంతుణ్ణి ఎన్నో రకాలుగా నుతించి, అతని చరణాలకు చుట్టుకొ పోయినా, అతణ్ణి ఇలా ఎందుకు నిందిస్తున్నానోనని నామదేవుడు ఒకచోట ఇలా అంటాడు:

'పొగడినా, తెగడినా నిన్నే.
ఇతరులతో నాకేం పని?

నిన్నే అంటిపెట్టుకొని ఉంటాను.
వైకుంఠంలో నాకు ఇంత చోటిచ్చువయ్యా.'

నీ చరణాలతో సంబంధం విడకూడదు. నిన్నే అంటిపెట్టుకుని ఉందామనే ధ్యాసలో నేనేమన్నా క్షమించాల్సిందే.

భక్తుడికి, భగవంతుడికి మధ్య ప్రణయ కలహాన్ని ఎలా ఊహించుకున్నాడో, చూడండి:

'పతితపావనుడవని విని నీ పంచకు వచ్చాను.
కాదని తెలిసి తిరిగి వెళ్ళిపోతున్నాను.
ఇచ్చి-పుచ్చుకోలు వాడివయితే, మహా ఉదారుడివేలే
నీ పంచనే ఎందుకు పడిఉండాలి నేను?
పతితపావన బిరుదాన్ని వదిలెయ్యి, బడాయిలు మానుకో.
ఎవరిచ్చారయ్యా నీకు ఈ బిరుదం?
ముల్లోకాల్లో డప్పు వాయిస్తాను
పతితపావనుడివి కాదు, మహా మోసగాడివని,
నీవల్ల నాకు ఒరిగేదేమీ లేదయ్యా
మనస్సులో ప్రేమభావం ఉండాలని నీ కాళ్ళావేళ్ళా
పడుతున్నాను.'

ఈ అభంగ్‌లో ప్రేమను, ఆత్మీయతను వర్ణించాడు. యుక్తివాదంతో, వ్యాజనిందతో ప్రారంభించి, శరణాగతభావాన్ని ప్రకటించాడు.

'నిద్రతో తన్ను తామరచినవాడి ప్రక్కన
ఉరగముంటేనేం? ఊర్వశి ఉంటేనేం?
నా విఠలదేవుడు నన్ను అనుగ్రహించాడు.
రెండూ ఒకటేనన్నట్లు చేసాడు
పేడా-బంగారం ఒకేలా కనిపిస్తాయి.
రత్నానికి-పాషాణానికి భేదం కనిపించదు
నీ చరణాలను ఆశ్రయించుకొని ఉన్నాను.
పైనుండి స్వర్గమే దిగిరానీ. నిప్పులే కురవనీ,
నాలో ఎటువంటి మార్పూ రాదు.

తెగడినా, పొగడినా
బ్రహ్మానందాకారుణ్ణి అయి ఉన్నాను.
బ్రహ్మానంద ప్రాప్తితో నామదేవుడు ద్వంద్వాతీతుడయినాడు.

మరో అభంగ్‌లో 'నన్ను నే చూసుకోవడానికి ఏ దీపం వెలిగించేదిరా ? చంద్ర సూర్యుల్ని ప్రకాశింపజేసేవాణ్ణి ఎలా చూసేదిరా?' అని అన్నాడు. మానవుడు క్షణక్షణం మృత్యువుకు దగ్గరవుతున్న విధానాన్ని ఇలా వర్ణించాడు. 'దొంగను కొరతవేయడానికి ఈడ్చుకోబోతున్నట్లు, అడుగడుగునా మృత్యువు కోరలు చాస్తున్నది.'

హిందువులు దేవాలయంలో, మహమ్మదీయులు మసీదులో పూజలు చేస్తారు కాని నామదేవుడు దేవాలయంలోను, మసీదులోను లేనటువంటి దేవుణ్ణి పూజిస్తాడు.

'హిందూ పూజే దేహురా, ముసల్మాను మసీద్
నామే సోఈ సేవిఅ జహ దేహురా న మసీత!

నామదేవుడికి సమస్త సృష్టిలో-అణువణువులో-భగవంతుడు కనిపించేవాడు. అందుకనే ఆయన దగ్గర రకరకాల ప్రతిమలు ఎప్పుడూ ఉండేవి.

బాలక్రీడలు, శ్రీకృష్ణలీలలు, నామ-మహిమ, ఆత్మనివేదనం, ఉపదేశం, రూపకం, చరిత్ర, భూపాలి, హారతి-ఇలా ఎన్నోరకాల పద్యరచన నామదేవుడు చేసాడు. అక్కడక్కడ సందర్భోచితంగా పురాణకథలు చెప్పడంతో ఆయన రచన రమ్యంగా హృదయాన్ని ఆకట్టుకొంటుంది.

## లోనివాణ్ణి బయటచూడు

నామదేవుడి కవిత్వం జ్ఞానదేవ, ఏకనాథ, రామదాసుల రచనలవలెనే, చేతనా ప్రపంచంతోనే కాక, అచేతనా ప్రపంచంతో కూడా సంబంధం కలిగి ఉంది. కనుక నామదేవుడికి ఒక కావ్యదృక్పథం, కావ్యధ్యేయం లేదంటారు. అది సరియైన అభిప్రాయంకాదు.

విఠలుడు, పండరిపురం, భక్తులు-వీరి సాన్నిధ్యంలో నామదేవుడి ప్రతిభ ఇంకా మెరుగులు దిద్దుకొంటుంది. అప్పుడాయన భక్తి భావ పారవశ్యంతో స్ఫూర్తి పొంది, అలంకారయుక్తమయిన భాషలో రచనలు చేసాడు. నామదేవుడు

రచించిన 'యుగే అట్ఠావీస్ విటేవరి ఉమా' అనే మంగళహారతిపాట,! 'శేజారతి' అనే పాట పాడకుండా, మహారాష్ట్రదేశంలో ఏ ధార్మికోత్సవం, ఏ వ్రతం పూర్తికాదు.

'నేను సాష్టాంగ నమస్కారం చేస్తాను
చరణాభివందనం చేస్తాను
కండ్లార నీరూపం చూస్తాను
ప్రేమతో ఆలింగనం చేసుకుంటాను
ఆనందంతో పూజిస్తాను
భావ పూరితంగా హారతి ఇస్తాను
(అని) నామా అంటున్నాడు!

అతి సాధారణంగా కనిపించే ఈ శేజారతిలో దీపకాలంకారం ఎంతో గొప్పగా ఇమిడిపోయింది.

ఇలా సహజ స్ఫూర్తితో కూడుకొని, అనలంకృతమయిన అభంగాలకంటే, నవనవోన్మేషశాలిని అయిన కల్పనా వైభవంతో కూడుకొన్న అద్వితీయ ప్రతిభా సృష్టి, విదగ్ధ సరసత్వంతో కూడుకొన్న అభంగాలు పాఠకులను ఆకట్టుకుంటాయి. మచ్చుకు రెండు అభంగాలు చూడండి.

ప్రపంచంలో దుఃఖాలు కలిగే తీరును యుక్తిబద్ధంగా ఇలా వివరించాడు.

దేశం పాపంచేస్తుంది, రాజుఫలితం అనుభవించాలి.
రాజుపాపం, రాజ పురోహితుడు అనుభవించాలి.
ఇది ధర్మశాస్త్రనియమం, సర్వవిదితం
కాని ఎవరికీ ఇందులోని మర్మం తెలియదు.
శిష్యుడి పాపం గురువు అనుభవించాలి
భార్యచేసిన పాపం భర్త అనుభవించాలి.
జనులు మాయామోహితులు
మాయాజాలంలో చిక్కుపడిపోయారు
(అని) నామా అంటున్నాడు'

నామదేవుడి వ్యవహారజ్ఞానాన్ని, వ్యుత్పన్న వ్యక్తిత్వాన్ని తెలియచేయడానికి ఈ ఒక్క అభంగ్‌చాలు. 'నాకు లౌకిక వ్యవహారజ్ఞానం తెలియదు, కల్పన

మనస్సుకు అంటదు. చిడతలు చేతధరించి, అందరితో కలిసి నాట్యమాడు తుంటే నాకు అమితానందం కలుగుతుంది' అని అనడం ఆయన వినయానికి నిదర్శనంగా గ్రహించవచ్చు.

'విఠలుడికి కన్నడ భాషవచ్చు
ఆయన భాష పుండలీకుడికి తెలియదు.
ఇరవై ఎనిమిది యుగాలు గడిచాయి
ఇద్దరికీ మాటలు లేవు
నడుంమీద చేతులు పెట్టుకొని
భీమానది ఒడ్డున నిలబడి ఉన్నాడు
నాస్వామి భక్తుని కార్యార్థం నిలబడి ఉన్నాడు
(అని) నామా అంటున్నాడు.'

ఈ అభంగ్ స్వభావోక్తిగా కనిపించినా, ప్రతి మాటలోనూ నామదేవుడి వ్యంగ్య వైభవం గోచరిస్తుంది. 'అంతస్సులో దాగి అన్నవాడివి, బాహ్యాన్ని పరి కిస్తావు. ఆకాశానికి ఉదరం-వెన్నూ ఉన్నాయంటే నిజమే అనుకోవాల్సి వస్తుంది. జ్ఞానదేవుడు అన్నట్లు అచేతనం, సచేతనం అన్నీ నీకు నప్పుతాయి నీకు బహు జ్ఞత అనే ముసుగు అవసరం లేదు'

## కవిత్వ - వ్యక్తిత్వాల్లో సమైక్యత

మరాఠీ భాషలో కవిత్వం - వ్యక్తిత్వం కలిసి ఏకాకృతి పొందిన భక్త కవి నామదేవుడు ఒక్కడే. ఆయన అభంగాలలో దేన్నివిన్నా, దాన్ని కూనిరాగంతో నయినా పాడాలనిపిస్తుంది. అలా పాడడంలో ఆయన భగవద్భక్తి, ఆయన కవి త్వంలోని భక్తిరసం-రెంటిపట్ల సమానమయిన ప్రత్యయం కలుగుతుంది. ఆయన రచించిన అభంగాలను ఆత్మ చరిత్రకు సంబంధించినవనీ, భక్తికి సంబంధించిన వనీ వింగడించడానికి వీలులేదు, జీవిత కథకు సంబంధించిన అభంగ్‌లో భక్తి, భక్తిపరమయిన అభంగ్‌లో నామదేవుడు కనిపిస్తుంటాడు.

కొంతమంది వ్యక్తులు మహాత్ములు అయితే వారి కవిత్వం వారికంటే గొప్పది. కొంతమంది కవిత్వం గొప్పది. ఆ కవిత్వంకంటే వారు గొప్పవారు, నామ దేవుణ్ణి గురించి అలా చెప్పలేము. ఆయన పేరులోనే నామమూ, దేవుడూ రెండూ ఉన్నాయి. దేవుడి అనుగ్రహంతో నామదేవుడు దేవమయుడయినాడు, ఆయన

భక్తి కారణంగా దేవుడు నామమయుడయినాడు. అలాంటి అభంగవాణి అతి పవిత్రమయింది.

ఏ భక్తుడి కీర్తనలు ఎవరు వ్రాసుకున్నారు, అని చెప్పే సందర్భంలో జనా బాయి ఇలా వ్రాసింది. 'జ్ఞానదేవుడి వాక్కులను సచ్చిదానందబాబా, నివృత్తి పలుకులను సోపానదేవుడు, ముక్తాబాయి మాటలను జ్ఞానదేవుడు, చాంగ్‌దేవుని పాటలను శ్యామాకాసారుడు, చోఖామేలా చొక్కపు పలుకులను అనంతభట్టు వ్రాసారు. మరి నామదేవుడి అభంగాలను ఎవరు వ్రాసారు? సాక్షాత్తు పాండు రంగడే వ్రాసాడని జనాబాయి అభిప్రాయం. ఇది ప్రతీకాత్మకంగా తోచినా, నామ దేవుడికి, పాండురంగనికి గల అవినాభావ సంబంధం తేటతెల్లమవుతుంది.

'నామం మంచిది. నామదేవుడు మంచివాడు
పరమాత్ముడి రూపం శ్రేష్ఠమయినది'

అని నామదేవుడి సమకాలికుడయిన పరసాభాగవత్ వ్రాసాడు. దీనికి ఇంకో ఉపమానం జోడించి చెప్పాలంటే వేడి పాలమీద మీగడ కట్టినట్లు, అనేక విధాలుగా ఉత్తప్తమయిన నామదేవుడి వ్యక్తిత్వం ఆయన కవిత్వంతో ముడిపడి ఉన్నది. పాలమీగడను పాలలో కలిపివేసినట్లు, నామదేవుడి వ్యక్తిత్వంలో ఆయన కవిత్వం మిళితమయి పోయింది.



# గ్రంథ సూచిక

## A. నామదేవుడు రచించిన గ్రంథాలు


1. నామదేవ కృత శివరాత్రి మాహాత్మ్యాచే అభంగ్ — 1847
2. నామదేవ కృత తీర్థావళిచే అభంగ్ — 1862
3. నామదేవ కృత జ్ఞానదేవాచ్యా సమాధీచే అభంగ్ (సం.రా.శ్రీ.గోంధళేకర్) — 1863
4. నామదేవాచీ గాథా (సం. రా. శ్రీ. గోంధళేకర్) — 1881
5. శ్రీ నామదేవాచీ వత్యాంచే కుటుంబాతీల్ వ సమకాలీన్ సాధూంచ్యా అభంగాంచీ గాథా (సం. తుకారామ్ తాత్యా) — 1894
6. శ్రీనామదేవ మహారాజ్ యాంచ్యా అభంగాచీ (జనాబాయి యాంచ్యా అభంగా (సహ) గాథా(గాథా పంచక్) (సం. త్ర్య. హ. ఆవటే) — 1098
7. శ్రీ నామదేవ మహారాజ్ యాంచ్యా అభంగాం చీ గాథా (జనాబాయి నారా, మహాదా, గోందా, విఠా, పరిసాభాగవత్, గోణాయీ, రాజాయీ, లాడాయీ ఆఊబాయీ, లింబాయీ యాంచ్యా అభంగా (సహ) (సం. త్ర్యం. హ. ఆవటే) .... 1923
8. శ్రీ నామదేవచ గాథా (సం విష్ణునరసింహ జోగ్) చిత్రశాలా ఆవృత్తి 2-1931
9. నామదేవరాయాంచీ సార్థగాథా (సం. ప్ర. సీ. సుబంధ్, ఖండ్ 1—4) 1949, 51, 54, 58
10. నామదేవాంచీ భజనే (సం. వినోబా భావే) — 1954
11. నామాయాచీ అమృతవాణి (సం. హరిశ్రీధర్ శేణోలీకర్) — 1966
12. సకల సంతగాథా 1-2 (సం. కాశీనాథ్ అనంతజోషి) — 1967
13. నామదేవ కృత బాలక్రీడా అభంగ్ (సం. మాధవ్ చంద్రోబా)
14. నామదేవ్ ఆణి రామదాస్ యాంచే అభంగ్ (సర్వసంగ్రహ మధూన్)
15. నామదేవాంచీ అభంగ్ గాథా (మహారాష్ట్ర ప్రభుత్వ ప్రచురణ) — 1970

## విమర్శ గ్రంథాలు

B. మరాఠీ


1. సంత శిరొమణి నామదేవ్ మహారాజ్ ఆణిత్యాంచే సమకాలీన్ సంత్— ఆజ్‌గాంవ్‌కర్ జ. ర.—1941
2 సంత్ నామదేవ్ ఇనాందార్ హేమంత్—.970
3. ప్రాచీన్ మరాఠీసంత్ కవి మొదటిభాగం-ఆజ్‌గాంవ్‌కర్ జ ర—1957
4. భక్త కథామృతసార్-ఉద్ధవ్‌చిద్ఘన్—1902
5. పంజాబాతీల్ నామదేవ్-జోషీ శంకర్ పురుషోత్తమ్—1940
6. ఆషాఢీకార్తికీ-ఖేర్ భాలచంద్ర దత్తాత్రయ—1-52
7. ఆటే ఉఘడాజ్ఞానేశ్వరా—జోషీ సంక్ర—1958
8 సంతాంచ్యా ఆత్మకథ-ధేరే రామచంద్ర చింతామణి—1967
9 సంతాంచ్యా చరిత్రకథ .. .. 1967
10. నామదేవ్: ఆధ్యాత్మిక్ చరిత్రవజ్ఞానదీప్-తల్‌షలే గణేశ్‌విష్ణు—1959
11. ప్రాచీన్ మరాఠీ వాఙ్మయా చా ఇతిహాస్-మొదటిభాగం (ఉత్తరార్ధం) దేశ్‌పాండే అచ్యుత్ నారాయణ్—1968
12. శబ్ద సృష్టిచే ఈశ్వర్-దేశ్‌పాంటే బాలశంకర్ 1960
13. శ్రీనామ్‌దేవ్ చరిత్ర-నాయిక్ శాంతారామ్ జీవాజీ—1908
14. మరాఠీ వాఙ్మయాచా పరామర్శ-నిరంతర్ గంగాధర్ భాపూరావ్—1957
15. మరాఠీ వాఙ్మయా ఇతిహాస్-మొదటిభాగం-పాంగార్‌కర్ లక్ష్మణ్ రామచంద్ర—1932
16. శ్రీ సంతశిరోమణి బాలభక్త నామదేవ్ మహారాజ్ హేదరో దేఖోర్ హాతే రాయ్ ? పాటన్‌కర్ పంఢరీనాథ్ నారాయణ్—1035
18. జ్ఞానదేవ్ ఆణి నామదేవ్ - పేండ్సే శంకర్‌దామోదర్—196?
19. పాంచ్ సంత చరిత్రే - పైఠణ్‌కర్ అనంత్—1969

29. శిఖాచ్యా ఆదిగ్రంథాతీల్ నామదేవ్-ప్రియోళ్కర్ అనంత్ కాకబా-1938

21. మహారాష్ట్ర సారస్వత్ (ఐదవ అధ్యాయం) భావేవినాయక్ లక్ష్మణ్—1963

22. భక్త లీలామృత్-మహీపతి—1904

23. భక్త విజయ - .. —1950

24. సంత్‌నామదేవ్ దర్శన్-మాండవకర్ భాఊ—1962

25. శ్రీ నామదేవ్ చరిత్ర-ముళేమాధవ్ అప్పాజీ—1952

26. సంతశిరోమణి శ్రీ న మదేవ మహారాజ్ యాంచీ వంశావళ్--రాణోశీరావ్ బీ. యస్.

27. సంతవచనామృత్-రానడేరామచంద్ర దత్తాత్రయ....1962

28. మరాఠీసంత్ వాఙ్మయాతీల్ పరమార్థమార్గ్ (ఇంగ్లీషు నుండి అనువాదం), -రానడే రామచంద్ర దత్తాత్రయ, వే. గజేంద్రగడ్కర్....1965

29. మహారాష్ట్రీయ సంత్‌వాఙ్మయవజీవన్-రేళేకర్ గో. నా., భిడే య. ద, —1952

30. మరాఠీచా పరిమళ్ (మొదటి భాగం) శిఖరే దామోదర్ నరహర్—1952

31. విష్ణుదాస్ నామ్యాచ్యా మహాభారతాచా వివేచనాత్మక్ అభ్యాస్ (వ్రాతప్రతి-పరిశోధనా వ్యాసం) - శేండే సరోజినీ—1961

32. శ్రీ నామదేవ్ మహారాజ్ భూమికా-కార్యబోధ్-సర్‌దేసాయి యశ్వంత్ సూర్యరావు—1950

33. శ్రీ నామదేవ్ దర్శన్ (వ్యాస సంకలనం)—1970

C. హిందీ

1. జనమ్‌సాఖీ శ్రీనామ్‌దేవ్జీ (మొదటి భాగం)—బాబా పూరన్‌దాస్—1888

2. శ్రీసంత్ వామదేవాంచీ సార్థహిందీపదే-బారటక్కే మాధవరావ్ గోవిందే —1968

3. సంత్ నామ్‌దేవ్ కీ హిందీ పదావలీ-మిశ్ర భగీరథ్

4. సంత్ నామ్‌దేవ్ ఔర్ హిందీ పదసాహిత్య-మిశ్రరామచంద్ర—1969
5. భక్తశిరోమణి నామదేవ్‌కీ నఈ జీవనీ, నఈ పదావలీ-మోహన్‌సింగ్ దివానా—1949
6. హిందీకో మరాఠీ సంతోంకీదేన్-శర్మ వినయమోహన్—1957

D. ఇంగ్లీషు

1. Stotramala - Abbot Justin E 1929
2. Sri Swami Namdev Ghoman - Bhagat Ram 1936
3. Court painters of the Grand Moghuls - Oxford - Laurance Binyon - 1921
4. The Sikh Religion : its Gurus, sacred writings andthors Vol VI. Oxford Macauliffe M. A. - 1909
5. Mysticism in Maharashtra - Ranade R. D. - 1933
6. Pathway to God in Marathi Literature - Ranade R. D- 1961
7. The Sacred writings of the Sikhs - Unesco collection - 1960.

1970 నవంబరు మాసంలో నామదేవుడి 700 వ జయంత్యుత్సవాలు మహారాష్ట్రంలోనూ, భారత దేశమంతటా ఘనంగా జరిగాయి. ఆ సందర్భంలో రచించబడిన ఈ పుస్తకానికి (మరాఠీ మూలానికి) భూమికలో కీ॥ శే॥ డా॥ సి డి. దేశముఖ్ గారు ఇలా వ్రాసారు: పదమూడవ శతాబ్దంలో మహారాష్ట్రదేశంలో ఎంతోమంది సారుపుంగవులు జన్మించారు. వారిలో కాలక్రమానుసారంగానే కాక, ఇతర అనేక గుణాలు కారణంగా నామదేవుడు ప్రథముడు. మరాఠీ భాషలో 'అభంగ్'ల రచనకు గట్టి పునాదులు వేసినవాడు నామదేవుడు. మరాఠీ భాషలో మాత్రమే కాక ఇతర భారతీయ భాషలలో కూడా 'అభంగ' రచనకు శ్రీకారం చుట్టినవాడు నామదేవుడే, సిక్కు మతసంస్థాపకుడయిన గురునానక్ తన ఉపదేశాల్లో నామమాహాత్మ్యానికి ఇచ్చిన ప్రాముఖ్యానికి నామదేవుడి ప్రేరణమే కారణం. అంతే కాకుండా 'గురుగ్రంథసాహెబు'లో మరాఠీ భాషతో పోలికలు గల 'సధుక్కడీ' భాషలో నామదేవుడు వ్రాసిన కీర్తనలకు స్థానం కలిగించారు. నామదేవుడి కార్యరంగం మహారాష్ట్ర ప్రాంతంవరకే పరిమితం కాలేదు. నర్మదకు ఉత్తరాన నేటి పంజాబు ప్రాంతం వరకు గల ఉత్తరభారతదేశంలో ఆయన భక్తిమార్గ ప్రచారం చేసాడు....

అట్టపై ముద్రించబడిన నామదేవుడి చిత్రం లారెన్స్ బినియన్ రచించిన 'Court painters of the Grand Moghuls' అనే పుస్తకం (1921) లోని వర్ణ చిత్రానికి నకలు.

రేఖా చిత్రకారుడు :

వి. యన్. ఓకే, బొంబాయి.

వెల SAHITYA AKADEMI REVISED PRICE Rs. 15·00